**SRIKARA SIKRARAM**
*(Collection of Lyrics in Telugu)*
by
**Dr. J. Bapu Reddy**

First Edition : **July 1985**
Second Enlarged Edition : **March 1993**
Third Enlarged Edition : **May 2002**



*Price :* **Rs. 100/-**
**US $10**

Copies available at :
**Visalandra Publishing House**
Vignan Bhavan,
Bank Street,
Hyderabad.

*Published by :*
**Jubilee Publications**
Plot 10, Road 5,
Jubilee Hills,
Hyderabad - 500 033 A.P. - INDIA

*Designed & Printed at :*
**Swamy Offset printers,**
Vijayawada-2.

(Book Released by Shri P. Krishniah, IAS Executive Officer TTD at a special function presided over by Prof. Ravaa Srihari, V.C., Dravidian University, Kuppam)

# అంకితం



ఏడు కొండల మీద వెలసిన
శ్రీ వెంకటేశ్వర స్వామివారికి అగణిత భక్తకోటి పక్షాన
16-5-2002 నాడు భక్తి ప్రపత్తులతో
అంకితం

"ఏడుకొండల మీద ఏమున్నదో కాని
నా గుండె అచటనే నాటుకొని పోయింది
గొడవేది జరిగినా, "గోవిందా! అంటుంది
తెరువేది లేనిపుడు, తిరుపతీ! అంటుంది"

* * *

"సిగ్గవుతున్న దినాకు శ్రీనివాసా
నెరసిన తలనీలాలను నీ కీయాలంటే
నీ కొరకే పోషించిన ఈ కుంతలనీలాలను
ఎంచుకిలా పాడు చేయుచుందువా గోవిందా
నాతలలోపలి తలపులు నీకు కానుపడవలెనని
నల్లని నా తలను తేట తెల్లముకావించావో!"

జె. బాపురెడ్డి

## శ్రీ పద్మావతి - వెంకటేశ్వరుల

ఆశీస్సులతో

"శ్రీకార శిఖరం" తొలి ప్రతిని స్వీకరించిన భక్తవదాన్యులు



శ్రీ లంక జానకి రామయ్య - శ్రీమతి లంక అమరవల్లి

# తొలి ప్రతి సమర్పణ

శ్రీ. లంక జానకి రామయ్యగారు

పవిత్ర గోదావరీ తీరంలోని

కోలంక గ్రామం మట్టిలో పుట్టిన మాణిక్యం

స్వయంకృషితో సత్యధర్మశీలతతో

సాగించిన తన జీవిత యాత్రలో సాధించిన విజయాలు,

ఆయన బహుముఖ ప్రతిభకు సాక్షీభూత పతాకాలు

సౌభాగ్యాల తూర్పుగోదావరి గడ్డపై పుట్టిన

ఈ తెలుగుబిడ్డ విద్యాభ్యాసం

ఆంధ్ర విశ్వావిద్యాలయంలో మొగ్గతొడిగింది

మధురై, అణామలై విశ్వవిద్యాలయాలలో

వికసించి పరిమళించింది

చెన్నాయ్, అహ్మదాబాద్, ఢిల్లీ, పుణె వంటి విద్యా విజ్ఞాన కేంద్రాలలో

ప్రజ్ఞాన ధనుడైన జిజ్ఞాసువు శ్రీ జానకిరామయ్య

దేశ విదేశాలలో పర్యటించి, మూటకట్టుకొని తెచ్చిన అనుభవాలను

స్వదేశ సేవకు అంకితం చేసిన దేశ భక్తుడు

కేంద్ర ప్రభుత్వ ఛత్రం కింది 'సిమెంట్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా'

ఉన్నతోద్యోగ పీఠం వేసింది

ఈ కార్యశూరునికి, కర్మవీరునికి

ఆయన వృత్తికి ఆదర్శనీయ శక్తిగా నిలిచింది
ఆయన చిత్త వృత్తి దేశభక్తి, దైవభక్తి.
సంఘసేవ - స్వామి పూజ, మానవ సేవకే అంకితంచేసిన
మహనీయ విలువలకు మారురూపం జానికిరామయ్య దంపతులు
సాహిత్యం, సంగీతం, నాట్యం, నాటకం, చిత్రలేఖనం వంటి
లలిత కలలన్నీ
మానవాభ్యుదయానికి మార్గాలని నమ్మిన మహా మనీషి ఆయన
అమృత కళా సాగర సంస్కృతి
"ఆంధ్ర కళారత్న" బిరుదంతో ఆదరించిన చిరత్న కళారాదకుడు
"లంక ఆర్ట్స్ థియేటర్స్"ను నిష్కళంకంగా నిర్వహిస్తున్న నిత్యసత్యశోధకుడు
పాత్రత ఎరుగిన ధానశీలి, పవిత్రత వెలిగిన జ్ఞానశీలిగా
జానకి రామయ్యను సమాజం గుర్తించి కీర్తిస్తున్నాది
నీతి నిజాయితీ రథం మీద నిర్మల ధర్మతత్పరత పథం మీద
ఆయన్ని నడిపిస్తున్నది శ్రీమతి లంక అమరవల్లి
ఆమె ఆయన అనురాగవల్లి, ఆనందాలవెల్లి, ఆదర్శ జీవితమతల్లి
అందుకే శ్రీకార ఓంకార స్వరూపులైన శ్రీ పద్మావతీ-వెంకటేశ్వరులకు
అంకితం చేసిన నా ఈ 'శ్రీకార శిఖర' కావ్య సంపుటి తొలిప్రతిని
ఆదిదంపతుల ఆశీస్సులతో
అమూల్యవరప్రసాదంగా సమర్పిస్తున్నాను

- జె. బాపురెడ్డి
కృతికర్త

# Lilting Lyricist

**– Amerendra**

In this latest collection of his poems, Dr. J. Bapu Reddy has sought to give expression to profound feelings of devotion with intensity of feeling and clarity of vision. Emotional integrity is the hall mark of devotional poetry and we have its unmistakable ring in all his poems, which display lyrical grace and charm of vivid imagery.

Many of the lyrics are addressed to Lord Venkateswara, the favourite God of the poet. In varying moods of supplication, quest, enquiry, elation and ecstay the poet offers tender flower of devotion at the Lord's feet.

*"My head is Tirumula*

*And you are its Lord*

*You are its refuge"* he exclaims and implores Him to come down from the din and bustle of the seven hills and reside in the silent sanctuary of his heart. He identifies Lord Venkateswara with the Truth and Love that transcend birth and death and establishes with it an intimate bond of kinship which snaps never.

In an interesting poem he describes himself as the darling child of three mothers and fervently invokes the gracious benedictions of Wisdom, Truth and Prosperity.

In another Poem addressed to Lord Narasimha of Simhachalam, the poet portrays him as the light of wisdom splitting and emerging from the petrified pillar of ignorance. When the ray of illumination flashes forth all shades of darkness flee and when the Sun questions where darkness is, the poet searches for it in vain, a symbolic lyric addressed to the Sun.

The lyric "Song of Light" affirms the poet's faith in the divinity of humanity and the humanity of divinity. He is convinced of the presence of an onlooker who is behind the world of the eye and the ear.

A new creative orientation is given to ancient mythis to fortify the communicative force of aesthetic experience.

*My fancies are Gopies,*
*In the pool of light*
*They entreat in nakedness,*
*The enchanting smile,*
*of the ravisher of souls*

He says in the opening song. Invoking the grace of Rama of Bhadrachala, the poet movingly remarks, "Your abode is on the bank of Godavari of my agonies" and prays to the Lord to ferry him across. In a lyric on Ranganatha, the poet portrays the immanent nature of divinity peeping through the painted veil of life. He feels

its presence in every blosslming flower, swaying wave, fanning breeze.

Though the poet addresses many of his lyrics to the deities of the Hindu Pantheon, there is no narrow sectrarian feeling in the poetry. He celebrates the universal aspects of truth, love and beauty, which strike a responsive chord in all hearts. The absolute and all pervasive aspects of god are stressed in some lyrics in this collection which embodies the vision and wisdom which seeks to blend monism and dualism. The spiritual Quest is linked with the creative urge of the poet who dreams as long as he breathes. For him poetry, in the words of Ezra pound, is a ceaseless voyage from half-covered blindness to naked light. He asserts paradoxically that we gain when we set out to seek, that we taste fulfillment when we begin to yearn for an ideal. With an almost Socratic ring, the poet exclaims "I know only one thing That I know not of one thing", reminding us of Omar Khayyam who uttered in dismay : "There is a door for which I found no key/there is a veil past which I could not see".

This collection of poems manifests the spiritual aspect of Dr. J. Bapu Reddy who hitherto made a mark as a poet of love and progressive ideology. With commendable courage of conviction the poet boldly declares

his faith in god in these days of rampant skepticism and fashionable rationalism. There is freshness, warmth and in his feeling–tone which is very rarely found in philosophical verse that tends to be vague and dull. As aptly remarked by John Keats "Axioms of philosophy must be proved upon our pulse". Poet Bapu Reddy has streered clear of dully abstractions which mar spiritual poetry. With intensity and integrity he has animated his lines. There are passages that provide proof of his maturity. The questing spirit of the poet does not let him rest on his oars. He is ever on the move seeking "fresh woods and pastures new". It is really surprising and landuable that a very busy Administrative Officer, J. Bapu Reddy, finds time to remain an unwearied votary at the shrine of the Muse and regards poetry not as a pleasant pastime but an avenue of fulfilment for life's sublime aspirations and invisible yearnings. The lyrics collected in this volume hold forth a brght promise of a higher achievement in the realm of spiritual poetry pioneered by Annamacharya and enriched by Tyagaraja. Bapu Reddy is endowed with imagination, intuition and introspection along with the art that can transform the heat of passion into the light of illumintion that can "convert a point into a line".

# హృదయనాదం

"శ్రీకార శిఖరం" నా కవితా చేతనకు కేతనం వంటిది. ఏనాడో అమెరికాలో ఎగరవేసిన నా ఆత్మానుభూతుల అక్షరరూపమిది. 'అది మూడవ విస్తృత ముద్రణకు నోచుకుంటున్న ఈ శుభసందర్భంలో ఆనంద స్పందనంతో మ్రోగుతున్న నా హృదయనాదం వినిపించాలనుకుంటున్నాను. అమెరికాలో వెలసిన వెంకటేశ్వర స్వామికి ఆనాడు అంకితం చేసిన శ్రీకార శిఖరం కావ్యసంపుటి ఈనాడు పునర్ విస్తృత మూడవ ముద్రణగా వెలువడుతూ ఏడుకొండల మీద వెలసిన శ్రీ వెంకటేశ్వర స్వామికి భక్తి ప్రపత్తులతో అంకితంచేసే భాగ్యం కలిగినందుకు నేనొక ఆనంద బిందువునైపోతున్నాను. ఈ సన్నివేశానికి కారణభూతులైన విజ్ఞులు రసజ్ఞులు దేశభక్తికి దైవభక్తికి మారురూపులైన శ్రీ లంక జానకి రామయ్యగారికి వారి సతీమణి శ్రీమతి లంక అమరవల్లి గారికి నా ఎనలేని కృతజ్ఞతలు.

మరుపురాని ఈ మధురానుభుతికి ప్రేరణ శ్రీ వెంకటేశ్వరస్వామి అనుగ్రహమే అని విశ్వసిస్తున్నాను. తొలిప్రతిని స్వీకరిస్తున్న శ్రీ లంక జానకిరామయ్య - అమరవల్లి దంపతులకు స్వామి వారి ఆశీస్సులు సహృదయుల అభినందనలు ఎల్లప్పుడు ఉండాలని ఆకాంక్షిస్తున్నాను. నిజానికి అమరవల్లియే 'జానికి'యై రామయ్యలో లీనమయ్యే ఉన్నది.

నేను నాలుగు దశాబ్దాలుగా వ్రాస్తున్న కవితల్లో మూడు ముఖ్యమైన భావధారలు గమనించాను. ఆలోచనా శిఖరాల నుండి, అనుభూతుల లోతుల్లో నుండి ప్రవహించే ఈ చైతన్య ధారలు నిజానికి ఏకైక సత్య సౌందర్య ప్రకటనాత్మకాలే. మనకు అగుపించే ప్రకృతినీ, పరిసరాలనూ, మనం అనుభవించే జీవితాన్నీ, మూడు రంగుల్లో చిత్రించుకుంటున్నట్లు, మూడు రంగాలుగా అన్వయించుకుంటున్నట్లు నేను గ్రహించాను.

అందుకే మన భావానలన్నీ ప్రధానంగా ప్రణయోన్ముఖంగానో, సామాజిక ప్రగతి పరంగానో, ప్రణవాత్మకంగానో ప్రకటితమౌతున్నాయి. అయితే ఈ త్రివిధాలోచనలూ, త్రిముఖానుభూతులూ పరస్పర సామరస్య సమన్వయం కలిగి ఉన్నప్పుడే సమగ్ర జీవితానందం సాధ్యమౌతుంది ఆ సరస సమన్వయ సాధనమే సాహిత్యం, ముఖ్యంగా కవిత్వం అని నా విశ్వాసం.

ప్రణయశీలిత, సామాజిక ప్రగతి శీలత, ప్రణవ శీలత, దర్శించే సత్యం ఒకటే ఆశించే ప్రయోజనం ఒకటే. స్త్రీ పురుషుల పరస్పర ప్రేమ, సమాజంలోని సాటి మనుషుల పట్ల సానుభూతి, అందరినీ నడిపిస్తున్న దనుకుంటున్న దైవం పట్ల ఆరాధన - ఈ రాగత్రయీదర్శనం జీవితానందమూ, ఇహపర సౌఖ్యమే కదా! అయితే ప్రణయరాగం. ప్రతిగతిరాగం కంటె మనిషిని ప్రభావితం చేసేది ప్రణవరాగం. కనిపించే మానవశక్తికీ కనుపించిన దైవశక్తికీ మధ్య ఉండే సంబంధ బాంధవ్యాలను బట్టే మనిషికీ మనిషికీ మధ్య వుండే భావబంధాలు సామాజిక సంబంధాలు రూపుదిద్దుకుంటాయి. మానవుడు - దైవం పరస్పర ప్రతిబింబాలే అన్న మహోన్నత భావచైతన్యంలో నుండి అద్వైతవాదం ఆవిర్భవించింది. అద్వైత భావావగాహన త్రికరణ శుద్ధిగా జరిగితే మనిషికీ దేవునికీ మధ్యేగాక మనిషికీ మనిషికీ మధ్య ఉండే అడ్డుగోడలు కూడా తొలగిపోతాయి. త్వమేవాహం, తత్వ మసి, సోహం, అహం బ్రహ్మోస్మి వంటి వేదోపనిషత్ సూక్తులు సార్థక మౌతాయి. మనుష్యులందరూ సమానులే. ఒకరు మరొకరిని పీడించడం, దోచుకోవటం తనను తానే వంచించుకోవడమే అనే సత్యస్ఫూర్తి కలుగుతుంది. అపుడు సమతా సమాజ స్ఫూర్తి సకలజన కల్యాణ దీప్తి సహజంగా కలుగుతుంది. అసమానత, అహంభావం, అశాంతి, హింస విధ్వంసలకు తావులేని ఐహిక సుఖాన్వితమూ ఆత్మానందానుభూతిచోదితమూ అయిన జీవితయాత్ర సాధ్యమౌతుంది.

ఈ దృష్టితో "శ్రీకార శిఖరం" ప్రణవాత్మకమైన అద్వైత భక్తిభావ బంధురమైన, గీతికా సంపుటి. ఇంచుమించు నేనింతవరకు వ్రాసిన ఆధ్యాత్మిక చింతనా పరమైన గేయాలన్నీ ఇందులో చేర్చబడ్డాయి. ఈ గేయాలన్నీ గాయనీ గాయకుల కమనీయ కంఠ సీమలలో శ్రుతి చేయబడి అశేష మానవ హృదయ సీమలో సమతానంద చైతన్యదీప్తి కలిగిస్తాయని ఆశిస్తున్నాను. కీర్తిశేషులు సాహితీమూర్తి ఆచార్య అమరేంద్ర ఈ గ్రంథం మీద ఆంగ్లంలో అభివ్యక్తం చేసిన స్పందన కృతజ్ఞతా పూర్వకంగా ప్రచురిస్తున్నాను.

ఇందులోని కొన్ని గీతాలను "శ్రీకార శిఖరం", "ఆరాధన లహరి" క్యాసెట్లుగా తీర్చబడ్డాయి. సంగీతం సమకూర్చిన శ్రీ సాలూరి రాజేశ్వరరావు, శ్రీ జి. ఆనంద్ గారలకు, గాయనీ గాయకులు శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ, శ్రీ ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, శ్రీమతి సుశీల, శ్రీ జి. ఆనంద్, శ్రీమతి వాణీ జయరాం, శ్రీ రామకృష్ణ, శ్రీ జయచంద్ర మొదలగు వారికి నా కృతజ్ఞతలు. ఈ భక్తి గీతాలను ప్రజాకోటికి అందించడానికి దోహదం చేసిన రసమయి సంస్థ ఎం.కె. రాము గారికి, యువకళావాహిని సారథి శ్రీ వైం.కె. నాగేశ్వరరావు గారికి నా కృతజ్ఞతలు నా జీవితయాత్రలో, సాహితీ యాత్రలో నాకు తోడు నీడగా నిలిచిన నా సతీమణి రాజేశ్వరికి నా ఆశీస్సులు - అభినందనలు. చిత్రాన్ని తీర్చి దిద్దిన శ్రీ స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, విజయవాడ వారికి కృతజ్ఞతలు.

16-5-2002

తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి

**జె. బాపురెడ్డి**

# ఇందులో......

# నా మనో భావనలు

నా మనో భావనలు గోపీజనం
నా క్రియా రంగమే బృందావనం
నా బ్రతుకు ఆనంద కృష్ణార్పణం

చంచలము నా మనసు
చంచలము నా మాట
సంచలన కర్మయోగాంచలము
నా బ్రతుకు
సుందర నాదరోదసిలో శివ
సత్యము వెదకు

నా భావగోపికా
నయనాశ్రు యమునలో
తేలాడు నీలిమము
లీలగా నను పిలుచు
ఆవేదనల శిలలు తొలిచి
అనురాగములుగా మలచు

నవకాంతి సరసిలో
నగ్నమై నా మనసు
అర్థించు గోవిందు
ఆనంద హాసాలు
తీర్చుకొనెను ఇన్నాళ్ళకు
తీరని సందేహాలు.

# కోహం కోహం

కోహం కోహం కోహం
అంటూ
కోకిల అడిగింది
సోహం సోహం సోహం
అంటూ
శూన్యం పలికింది.

కాల కల్పతరు శాఖల దాగిన
కలకంఠం ఎవరో !
చుక్కల రెక్కల అక్కున ఒదిగిన
శూన్యాండం ఎవరో !

ప్రత్యుత్తరమేలేని ప్రశ్నకు
ఉత్తరమే ప్రశ్నా !
ప్రశ్న ఏదియే ఉత్తరమేదో
ప్రవచించేదెట్లో !

ప్రశ్నోత్తరములు రెండే పాత్రలు
ఆడేనాటకము
ఆది అంతమౌ అంతము ఆది
అద్భుత నాటకము.

# గుడులన్ని దర్శించి

గుడులన్ని దర్శించి
బడులన్ని పఠియించి
తెలిసికొన్నది ఏమొ
తెలియ రాకున్నది --

గుడిలోన పూజారి
అడగనీయడు ప్రశ్న
బడిపంతులికి నా
భాష అర్థముకాదు --

మందిరాలు నేర్పె
మౌనమే మౌనము
పాఠశాలలు నేర్పె
పఠనమే పఠనము --

తెలుసుకోవలసినది
తెలిసినది గుడిలో
తెలుసుకోజాల మని
తెలిసినది బడిలో --

గుడిలోన గ్రుడ్డినై
బడిలోన చెవిటినై
మూగవోయిన మీద
యోగినైనాను --

# అడవులు నన్నడిగినవి

అడవులు నన్నడిగినవి
పాట పాడమని
కొండలు నను కోరినవి
ఆటలాడమని --

ఏ పాటలు పాడుదు, ఈ
ఏటి గట్టు పైన
ఎడతెగని ప్రజాప్రవజ, క
న్నీటి గట్టు పైన.

ఏ ఆటలు ఆడుదు ఈ
ఇరుల గిరులపైన
తరుణాశాశయ విరి
సంధ్యా శిఖరము పైన.

ఆర్త వేణు వంటగానె
ఆరిపోవు నాపెదవులు
హత జీవిత శిలల మీద
ఆగిపోవు నా పదములు.

అడవుల కేమెరుక నేను
ఆకలి కృష్ణుడనని
కొండల కేమెరుక నేను
కుమిలిన శంకరుడనని.

# మురజ మేదో నా మదిలో

మురజ మేదో నా మదిలో
మురళి యేదో నా యెదలో
మ్రోగుచున్నది
డోల లూగుచున్నది.

తడబడు నా పదములే
తాండవ మాడేను
వణకే నా పెదవులే
ప్రణవము పాడేను --

ఏ శిల నే తాకినా
హిమగిరియై పోతున్నది
ఏ కల నే కనినా
వాస్తవమై పోతున్నది --

పిడికిటిలో త్రిలోకాలు
పినాకమై పోయెను
చూపులలో త్రికాలాలు
చక్రముగా మారెను --

శంకలన్ని నాద వేద
శంఖములై పోయెను
తెరవు లన్నీ యమునా
తీరమ్మే చేరెను --

# సూరీడు నా ఇల్లు

సూరీడు నా ఇల్లు
చొచ్చుకొని వచ్చి
చీకటేదని అడిగె
సిగ్గయ్యె నాకు --

నీవు వచ్చే దాక
నా వెంటనే ఉండి
నిను చూచి చిటికలో
మాయమైనది అంటి --

చీకటీ చీకటీ
చీకటని అరచితివి
చీకటేదని యంటె
చూపలేకుంటి వనె --

నీ జాడ నా జాడ
ఏ జాడ కననీని
స్థితిని, చీకటి అనక
శివమందునా అంటి --

నీ కళ్ళు మూసుకొని
చీకటని భ్రమసితివి
కను తెరచి నను చూసి
కనలేవు చీకటిని --

# చెప్పలేనివి

చెప్పలేనని చెప్పగలిగిన
యప్పుడే నీ మెప్పు పొందుదు
చెప్పుచుండిన యంతకాలం
తప్పులుంటే ఒప్పుకొందును --

చెప్పుచున్నదె చెప్పుచుంటి
చేయు తప్పులె చేయుచుంటి
చెప్పుటే నా తప్పు కాదని
చెప్పలేవా !

నాకు తెలిసిన దొక్కటేగా
నాకు తెలియని దొక్కటే యని
తెలియదని చెప్పుటకు కూడా
తెలివి లేదని --

చెప్పకుండా ఉండ లేనని
చెప్పమందువా తప్పులైనా
తప్పులేవో ఒప్పులేవో
తెలుపు సూత్రము
తెలుప లేవా !

# ఏమాదిరిగా జీవించాలో

ఏ మాదిరిగా జీవించాలో
ఈ మాయామయలోకంలో

ఉన్నదనుకొని ఉరుకులాడితే
వెన్ను పూసయే విరుగుతున్నది
లేదు లేదని వాదులాడితే
ఉన్నది కూడా ఊడుతున్నది --

తనువు కాదని మనసు చెప్పితే
మనసు కాదని బుద్ధి చెప్పితే
అదీకాదని ఆత్మచెప్పితే
ఏది ఏదియో అర్థం కాని
బూదిలోన దిగబడి పోతుంటిని --

పంచేంద్రియాలు పసిపాపలట
పదార్థ జ్ఞానం పనికిరాదట
అసలు తెలిసినది ఆత్మకేనట
ఆత్మ ఏమిటో అర్థం కాదట --

అంత ఇంత అని అవధులు లేని
అనంత మెంతని అడగకూడదట
అంత ఇంతలన్ను అంతం చేసే
అనంతమంటే అనంతమేనట --

పుట్టినదెల్లా చచ్చుట నిజమట
చచ్చినదెల్లా పుట్టవచ్చునట
చావు పుట్టుకలు లేని దొక్కడే
స్వయంభువట అది సంభవమేనట.

# ఊపిరి ఉన్నంతదాక

ఊపిరి ఉన్నంతదాక
నీ పాటే పాడుతా
ఊపి రాగెనా
నేనే
నీ పాటై పోతా --

భాషాకటే అయినా
పరిభాషలు వేరైనట్టు
భావమొకటె అయినా
ప్రభావములు వేరట్లు
పాడిన పాటే పాడిన
ప్రాతబడుట లేదు

పాడిన తీరె పాడే
పాటలలో పదములలో
ప్రభవించే ప్రభవేరు
ప్రసరించే ప్రమ వేరు

నా ఊపిరె నా పాట
నా పాటే నా ఊపిరి
ఈ ఊపిరి దీపము
నీ వెలుగు రూపము

# కన్నదేమో శారద

కన్నదేమో శారద
నను
పెంచుకున్నదేమో శైలజ
శ్రీలక్ష్మి నన్నిపుడు
చేరదీస్తున్నది

ముగ్గురమ్మలు తమ
ముద్దు బిడ్డగ నన్ను
కలిసి మురిపింతురో
కలహించుకొందురో !

ఓ తల్లి మోములో
ఓ తల్లి కనుపించు
ఏ తల్లయిన నాకు
నా తల్లె యనిపించు

ఒక అమ్మ పెట్టినది
ఒక అమ్మ కిచ్చుచు
ఆడుకొనుచుంటి
సత్యాకాశ సరసిలో

చదువు చెప్పిన తల్లి
శక్తి ఇచ్చిన తల్లి
ఆనంద లక్ష్మికే
అప్పగింతురా నన్ను !

# ఏమన్నది చుక్క కన్నె

ఏమన్నది చుక్క కన్నె
ఏమన్నది, ఏమన్నది ?
కన్నుగీటి మిన్నులోకి
నన్ను రా రమ్మన్నది
ఎన్నాళ్ళిక మన మధ్య
ఈ వియోగమన్నది --

నేనో నరవరుడట
తను తారా వధువట
నరనక్షత్ర ప్రణయము
నవప్రణవ ప్రభవమట

నేనో తన భాషయట
తానో నా భావమట
భాషా భావాల
బంధమె ఆనందమట

శ్రీకారము నే నంటే
ఓంకారము నేనన్నది
నీవు నేను కలిసినచో
నిజము బయటపడున్నది

దిక్కులేని సృష్టిలోన
దిక్కెవ్వరు మనకంటె
దిక్కులన్నిటికీ, మనమె
దిక్కన్నది మొక్కన్నది

# సత్యముతో

సత్యముతో చేసితి
దాంపత్యము
నిత్యము కంటినొక
భావముత్యము --

సత్యముతో నా ప్రయోగ
యోగ దాంపత్యము
ప్రసాదించునట్టి సంతు
అనంతము - దైవత్వము

ముద్దు బిడ్డలిద్దరు, మా
మురిపెము తీర్చెడివారే
ఆడుచు పాడుచు నుందురు
హాయిగ ఎవరికి వారే

అంతర్ముఖియై ఒకరు
ఆత్మతోడ ఆడుకొనును
బహిర్ముఖము వెట్టి ఒకరు
పదార్థముల పాడుకొనును

ఇద్దరిలో మీకెవ్వరు
ఎక్కువ ప్రియతములు ?
అని అడిగితె బదులు పలుకు
ఆనందాశ్రువులు.

# నా తల తిరుమల

నా తల తిరుమల
పతి నీవే దానికి
నా గతి నీవే స్వామీ !

వంచలేను దానిని
దుర్వాంఛల ముందు
దించలేను నిన్ను
పరాధీనత యందు

ఏడు కొండ లెక్కినా
మరెన్ని కొండ లెక్కినా
ఎక్కడ దొరికేదైనా
ఈ తలంత కొండేగా !

నా తల, నీ పాదాలు
ఈ తీరున కలిసినపుడు
జడ చేతనముల దాగిన
జీవన సత్యాలు వెలుగు

నీకు తెలుసు నెల్లప్పుడు
నాకు తెలిసినది ఇప్పుడు
నీకూ నాకూ మూలము
శ్రీకారము ఒకటేనని

# సింహాచల శిఖరము

సింహాచల శిఖరము
చేరుకొంటిని
నరహరులను నాలో గని
నవ్వుకొంటిని

శ్రీపతి వీరావేశ
రూపము గంటి
దీనజన ప్రహ్లాద
దీపము కంటి
సింహాచల శిఖరము చేరుకొంటిని ....

శీతల చందన చర్చిత
శ్రీరాగము వింటి
జర్జర జీవిత
విప్లవ గర్జన వింటి
నరహరులను నాలో గని నవ్వుకొంటిని

స్తంభించిన
అజ్ఞాన స్తంభము నుండి
జృంభించిన
ప్రజ్ఞాన సింహము గంటి
సింహాచల శిఖరము చేరుకొంటిని ...

దేహమును విస్మరించి
సోహమంటిని
మోహాహము వీడి
దాసోహమంటిని.

# ఉన్నది నీ చేతిలోన

ఉన్నది నీ చేతిలోన చక్రము
పట్టుకొన్నది నను
దురాచార నక్రము

భాష మ్రింగుచున్నది
నా భావమును
ఆశ మ్రింగుచున్నది
నా ఆశయమును --

పదవులు పొడిచేయును
నా చదువులను
స్వార్థము తుడిచేయును
నా జ్ఞానమును --

అహము నోట చిక్కెను
ఆలోచనము
వెరపుచేత స్రుక్కెను
వివేచనము --

ఉన్నది యనుకొన్నది
మరుగైనది
లేదనుకొన్నది
కనబడుతున్నది --

# నీ మాటయే నిక్కమా !

నీ మాటయే నిక్కమా
నా మాట ఎకసక్కెమా

ఏ పాట పాడినా
నీ పాటె అయిపోవు
ఏ బాట పోయినా
నీ బాటె అయిపోవు
ఏ పాట నా పాటరా
ఏ బాట నా బాటరా !

నీలోన నేనుంటె
నాలోన నీవుంటె
అంతటా అన్నిటా
అక్షరతె నెలకొంటె
ఈ సంకటములేలరా
ఈ సందియము లేలరా!

అనుకూలమైనట్లు
అర్థాలు చెప్పుకొని
అర్థమ్ము కానిచో
వ్యర్థమని తప్పుకొని
ఎన్నాళ్ళు గడిపేదిరా
ఎవరసలు తెలిపేదిరా !

# ఏడు కొండలమీద

ఏడు కొండలమీద
ఏమున్నదో కాని
నా గుండె అచటనే
నాటుకొని పోయింది --

గొడవేది జరిగినా
గోవింద అంటుంది
తెరువేది లేనపుడు
తిరుపతీ ! అంటుంది --

శక్తులన్నిటి కాది
భక్తియే అంటుంది
ప్రగతి యాత్రారధము
ప్రణవమే అంటుంది --

దివిలోని భువిలోని
దీపమొకటే నని
ఈ చరాచర సృష్టి
శ్రీ చక్రగతమని
తత్వాలు చెపుతూన్నది
గొప్ప సత్యాలు చెపుతూన్నది

మాయ మనుషులతోడ
మాట గెలుపుల కన్న
నిశ్శబ్దశూన్యాన
నిలుచుటే మేలట

# కనులు మూయగలిగితే

కనులుమూయ గలిగితే
కనిపించని దేది !
చెవులు మూయ గలిగితే
వినిపించనిదేది!

కనులకు కనపడేదెల్ల
కాంతి భ్రాంతియేనా !
చెవులకు వినబడేదెల్ల
శబ్దాభాసేనా !

చూచితి ననుకున్నదేమొ
శూన్యమ్మై పోవు
విన్నాననుకున్నదేమొ
వెర్రియనే తోచు --

మూలతమము కనుపించు
ముకుళిత నేత్రాలకే
నిశ్శబ్దము వినిపించు
నిద్రిత కర్ణాలకే --

# ప్రశ్నించుట ఒక భ్రమ

ప్రశ్నించుట ఒక భ్రమ
ప్రత్యుత్తరమొక భ్రమ
ప్రశ్నోత్తరములు లేని
పారవశ్యమే ప్రమ --

ప్రశ్నించి ప్రశ్నించి
ప్రస్తరమై పోనేల
ప్రత్యుత్తరముల కోసం
ప్రయాసపడనేలా ?

తెలిసిన వాడెవ్వడు
తెలిసికొనే దెవ్వడు
తెలిసిన వాని జాడ
తెలిసిన వాడెవ్వడు

అడుగుతున్న ప్రశ్నయే
అర్థము కానప్పుడు
అర్థమైన దుత్తర మని
అనుకొనుటయు వ్యవర్థము

దేహము అడుగడుగున
సందేహముతో తడబడు
ఔనని కాదని లోలో
అయోమయత వినబడు

# వాణీ నా రాణీయని

వాణి నా రాణియని
వాదాలకు దిగలేను
వరవీణాపాణియైన
వాణే నా వాణియౌట --

త్వమేవాహ మని నేను
తగాదాలు పడలేను
తనువు లేని వాడే, నా
తనువులోని వాడౌట

దేశమనీ కాలమనీ
దేనికది చూడలేను
వెలుగును దీపమునుండి
విడదీయుట గ్రుడ్డియౌట --

భావమనీ భౌతికమని
భాగించే వెర్రికాను
భావమ్మే భౌతికమై
భాసించే రూపునేను --

జనన మరణములు నాతో
జతకూడిన సత్యాలే
నా అనంత జీవనరథ
శాశ్వత జవనాశ్వాలే

# యమగోల

యమగోల గా ఉన్న
ఏడు కొండల మీద
ఎట్లుందువో నీవు
హే ! వేంకటేశా !

ఏ గొడవలేని, నా
ఎదలో వసించరా
ఏ సుడులు లేని, నా
మదిలో సుఖించరా

ఎపుడు ఏచోట, నీ
వేమేమి చేసినా
గుట్టుగా నాగుండె
గూటికే చేరరా !

నీతత్వ జ్ఞానము
నిదుర లేపితె నన్ను
నా సత్యగానము
నడిపించురా నిన్ను --

నీవెవరు నేనెవరు
వెలుగు నీడలు తప్ప
నను నీవు విడలేవురా
నిను నే పొగడలేనురా

# శ్రీకార ఓంకార

శ్రీకార ఓంకార
శిఖరాల మీద
శివతాండవమ్మాడెద
విప్లవతాండవమ్మాడెద ..

నరశక్తి సురశక్తి
నాశక్తిగా మారి
నాలోన నినదించగా
నావెంట నర్తించగా
శ్రీకార ఓంకార ..

తత్వాలు తర్కాలు
యోగ ప్రయోగాలు
నా భాషయైపోవగా
నాద వేదాలు కాగా
శ్రీకార ఓంకార ..

నవగ్రహ మృదంగాలు
నక్షత్ర డమరుకలు
భ్రమజ బాధలు బాపగా
ప్రమజ మోదము కూర్చగా
శ్రీకార ఓంకార ..

దేశకాలాలు, నా
దేహాత్మలై పోయి
సత్యాలు పండించగా
సౌఖ్యాలు కురిపించగా
శ్రీకార ఓంకార ..

# సత్యాల ముత్యాలు

సత్యాల ముత్యాలు
సరులు కడుతున్నాను
ఆనంద వీధిలో
అమ్ముకొంటున్నాను --

ఎన్నెన్ని సత్యాలో
ఎన్నలేకున్నాను
సరులెన్ని కూర్చినా
సరిపోవు పేలేదు --

అణువణువులో పూయు
అగణిత సత్యాలు
గణన చేయుటలోనె
గడుచునో నా బ్రతుకు --

ఏది ఏ సత్యమో
ఏదసలు ముత్యమో
చెప్పలేనప్పుడు
చకితుడౌతున్నాను --

సత్యమైనట్టిదే
స్తుత్యమౌనదిగాన
స్తుత్యమౌ సత్యాలు
తోరణాలుగ కట్టి
సరసలోకాలకు
స్వాగతం పలికేను --

# ఏకాంతం

ఏకాంతం నన్నెంతో
భయపెట్టేను
అభియోగం తెలుపకుండ
చెరబట్టేను --

ఆలోచన కోలాహల
వారిధిలో దాగినట్టి
శీలాకణమును నన్ను
ఏలాగున పసికట్టెనో
ఏకాంతం --

అడుగు వేయలేని నన్ను
ఆకాశ పథాలలోన
దిక్కు దిక్కుగా త్రిప్పును
చుక్కలు కని వెక్కిరించ
ఏకాంతం --

చెవులు మూసి నాకేదో
శంఖారావము విన్పుచును
కనులు మూసి నాకేవో
కలల లోకములు చూపును
ఏకాంతం --

ఈ అనంత సృష్టిలోన
ఏది సత్య మేది కాదో
చెప్పు చెప్పుమని నన్ను
చెప్పుదాక వేధించును
ఏకాంతం --

# వెదకబడేదేదైనా

వెదక బడే దేదైనా
వెదకే వారే అందురు
కోరబడే దేదైనా
కోరేవారే అందురు --

ఆ వెదకేదేమిటి ?
ఆ కోరేదేమిటి?
అందరు అందరిని నడుగుచు
అందరూ వెదకుచు నుందురు --

దొరకదని తెలిసికూడ
దొరికినట్లె పరుగిడుదురు
తీరదని తెలిసికూడ
తీరినట్లె కూర్చుందురు --

దొరికిన దొరకక పోయిన
వెదుకుటయే ఆనందం
తీరిన తీరక పోయిన
కోరుటయే జీవితం --

వెదకిన దొరకనిది లేదు
కోరిన తీరనిది లేదు
వెదకుటయే దొరుకుటేమొ !
కోరుటయే తీరుటేమొ!

# రాయిరాయిలో

రాయిరాయిలో, సృష్టి
రాహస్యం వెదుకుచుంటి
చెట్టుచెట్టులో, మట్టి
గుట్టును కనిపెట్టుచుంటి --

కొండ కోనలందు, వెర్రి
కోతి వోలె తిరుగుచుంటి
పగలు రేలు రెక్కలుగా
పక్షివోలె ఎగురుచుంటి --

చేపకంటి పాపనయ్యి
సింధువులను తరచుచుంటి
పూలగుండె తావినయి
గాలిని గాలించుచుంటి --

చుక్కలతో శూన్యముతో
చుట్టరికము నెరపుచుంటి
మనిషికి దేవునికి, ఒకే
మాతృభాష నేర్పుచుంటి.

# వెన్నెల పానుపు మీద

వెన్నెల పానుపు మీద
వెలకిల పవళించి
చక్కని చుక్కలతోడ
సరసమాడనా !

చుక్కలకనగానే, ఎద
చందమామ అయిపోవు
చీకటి వీధుల్లో, ఏదో
శృంగారం వెలిగించు --

నింగివైపు చూచి చూచి
నేలమాట మరచిపోదు
అంతులేని నీలిమలో
వింతపక్షినై పోదు --

అనుభూతికి అడ్డుతగిలి
ఆలోచన వికటించు
ఆలోచన నధిగమించి
అనుభూతి పరిమళించు --

మింటిలోని అందాలను
మంటిలోన కలుపనా !
మంటిగోళమును, తారా
మండలాన కెత్తనా !

# కలలో దేవుడు

కలలో దేవుడు - నేను
కలిసికొంటిమి
ఒకరి బాధ ఒకరము
తెలిసికొంటిమి -

నీవు గొప్ప వాడవంటె
నీవె గొప్పవాడవని
పొగడుచు, ఎవరిని వారే
తెగడుకొంటిమి -

సాగరము నీవంటె
జలదము నీవన్నాడు
వాహినివి నీవంటే
వారిధి నీవన్నాడు -

నీ వనంత వేది వంటె
నీ వనంత వాది వనెనె
అసలు రహస్యం అడిగితె
అది - నాకూ తెలియదనెను.

నీవైనా నేనైనా
ఎవరేరూపకులైనా
అందరూ సమాధానము
పొందగోరు పృచ్ఛకులే
అనుకొంటిమి, కలయే
నిజమనుకొంటిమి ..

# తాడును పాముకొని

తాడును పాముకొని
చచ్చిపోకురా
పామునే తాడుచేసి
బ్రతికిపోరా!

రాయిని దేవుని చేసి
మనిషిని బలిచేయకురా
మనిషిని దేవుని చేసి
జడతను తొలిచేయరా -

సూర్యుని వేడిని కొలిచే
చూపున్నది నీకు
హిమగిరి ఎడదనుమలిచే
క్రేపున్నది నీకు -

నీ అనల్ప భావనలో
ఈ అనంత సృష్టిపుట్టు
నీ జయాపజయములలో
ఈ జగత్తు మెట్టు, గిట్టు -

నీ భావమె నిలిచి పోవు
గా భౌతికమై
ఈ భౌతిక మేగసిపోవు
నీ భావనయై.

# ఆగిందీ ఆగిందీ

ఆగిందీ ఆగిందీ
ఆటోమ్యాటిక్ గడియారం

క్షణక్షణాలను లెక్కబెట్టుకొని
నిమిషనిమిషమును మూటగట్టుకొని
గంటలుకొట్టుచు ఘంటా పథమున
పరుగిడు తెరువరి పని తీరినది -

రెక్కలుసాచి రేయింబవళ్ళు
దిక్కు తెలియని వలయంలో పడి
అడిగిన ప్రశ్నే అడుగుచు అడుగుచు
తిరిగి తిరిగి మతి తిరిగిపోయి
ఆగిందీ ఆగిందీ ఆటోమ్యాటిక్ గడియారం

మధ్యందినాన మధ్యరాత్రిలో
కరాలు రెండూ శిరాన మోడ్చి
నీవే దిక్కని దేవుని మ్రొక్కుచు
సాగే చక్కని కరదీపం
ఆగెను చటుక్కుమని పాపం -

పోయిన దారినె పోయీపోయీ
చేరిన చోటికె చేరీ చేరీ
వృత్తం పునరావృత్తం బ్రతుకని
వెర్రిమొర్రిగా తిరిగిన యంత్రం
ఆగినచోటే అసలు గమ్యమా !

# తేజోమయ గేయం

తేజోమయ గేయం
నా జీవిత ధ్యేయం
మానవ శంఖారావం
నా నవరస భావం --

కనబడనిది  చూపించెడి
వినబడనిది వినిపించెడి
నిత్య సత్య సాహిత్య
నిజానంద సంగీత
తేజోమయ గేయం
నా జీవిత ధ్యేయం -

నరులకు సురులను చూపెడి
సురులకు నరులను చూపెడి
శబ్దమునకు నిశ్శబ్దము
నిశ్శబ్దమునకు శబ్దము
నేర్పెడి నిర్మల నిశ్చల
తేజోమయ గేయం
నా జీవిత ధ్యేయం -

జరామరణములు లేని
దురాశ దోపిడులు లేని
హెచ్చుతగ్గులు లేని
ఏ దుఃఖాలు లేని
తేజోమయ గేయం
నా జీవిత ధ్యేయం -

# త్యాగయ్య పాడుకొనెను

త్యాగయ్య పాడుకొనెను
తలపు తంత్రితో
అన్నమయ్య ఆడుకొనెను
వలపు బూహతో -

రాగముతో రామయ్యను
రప్పించారు
వేదనతో వెంకన్నను
మెప్పించారు -

భక్తియోగమున, జ్ఞాన
శక్తిని సాధించారు
కర్మయోగమును మించిన
ధర్మములేదన్నారు -

ఆశలు వదిలేశాక
అబ్బేది నిత్యమని
కళ్ళు మూసుకున్నపుడు
కనబడేది సత్యమని
త్యాగయ్య పాడుకొనెను ....

బ్రతికినంత కాలమే
బాధలు భవబంధాలు
బ్రతుకు నదీనదాల తుది
సదానంద సాగరమని
త్యాగయ్య పాడుకొనెను ...

# పుట్టినప్పటి నుండి

పుట్టినప్పటినుండి నిన్ను
పట్టుకొను దొంగాట ఆడుచు
పట్టుకో అని ఎదుట నిలిచితె
నా కను కట్టు విప్పెడివారు లేరు -

పుట్టు కొమ్మని పట్టు పట్టిన
దిట్ట నీవే
పట్టరానటు పరుగు పెట్టిన
పిట్ట నీవే
పట్టుకొమ్మని నిల్చినట్టి విరాట్టు నీవె !

ఆట అంటె ఏదో ఒక్క ఆటకాదు
మాట అంటె అర్థమయ్యే మాట కాదు
బాట అంటే దిక్కు తెలిసే బాటకాదు
చిక్కులన్ని పెట్టి నీవు చిక్కుతావా !
చిక్కినట్టే చిక్కి శిఖరాలెక్కుతావా !

మాయదారీ! తెలిసినవి నీమాయలన్నీ
స్వీయనాటక కర్త కర్మ క్రియలన్నీ
మాయ కనుటకు బయటి కనులు
మూయ వలెనా !
తీయజాలనిలోని తలుపులు
తీయ వలెనా

కనులు మూసిన కనులు తెరచిన
కాను పడవు
కాను పడుటకు వలయు కన్నులు
కాన రావు -

# దేశం భాష

దేశం భాష
కాలం భావం
నా అనంత కావ్యానికి
నా అఖండ గీతానికి -

దేశం దివిటీ
కాలం కాంతి
నా నవసాహస యాత్రలో
నా తిమిరార్ణవ మథనంలో

దేశం గుర్రం, కాలం క్షేత్రం
నా ఊహల పందాలకు
నా వాక్కుల జాకీలకు -
దేశం వారధి, కాలం వాహిని
నా ప్రయోగ నౌకలకు
నా ప్రయాగ శక్తులకు -

దేశం పూవు, కాలం తావి
నా ఆలోచనల వనికి
నా అనుభూతుల ఆమనికి

దేశం దేహం, కాలం ఆత్మ
నా భౌతిక సత్యాలకు
నా కల్పిత స్వప్నాలకు

# ఏడు కొండల మీద ఆహా!

ఏడుకొండలమీద ఆహా
ఎంత సుందరమైన లోయ
లోయ గర్భములోన నీ గుడి
లోతు తెలియని లోకమాయ -

కొండలన్నీ కొలిచి కొలిచి
గుండెలో గుడికట్టు కొంటి
లోయలన్నీ తరచి తరచి
నా,
లోననే నిను పట్టుకొంటి -

అన్ని గంగలు కలిపి తెచ్చి
ఆకాశ గంగను చేసితి
పరమ సేవా భావములతో
పాపనాశన పథము వేసితి

అమ్మలందరినడిగి అడిగి
మంగమ్మ ఎవరో తెలుసుకొంటి
శంకలన్నీ వదలి వదలి
సత్యమేదో తెలిసికొంటి.

# నా తల జూచి

నా తల జూచి
తల లూపుదురు
తోక చూడగనే
తోక ముడుతురు -

శిరమున ఆడే
శివ సౌందర్యం
నాది కాదని
ఆదరింతురు
తోకకు అంటిన
లోకా చారం
నాదే అనుకొని
భీతిల్లెదరు --

తల ఎవ్వరిదో తోక ఎవరిదో
తెలుపుటకే నా తల పండినది
తలతోకలు ఎరుగని మూఢులకు
తారకమై నాతోక ఆడినది -

తలరాతలు చేతులలో కలవని
పలికే సత్యాచలమే నాతల
తోకల పోకడలే మన తలలను
తగుల బెట్టునని చెప్పుట నా కథ.

# నా చర్మచక్షువు

నా చర్మ చక్షువు దిదృక్షువు
నా మర్మచక్షువు ముముక్షువు

చూచినదే చూచునెపుడు
చూడనట్లే
కోరినదే కోరు ఎపుడు
కోరనట్లే
నా చర్మ చక్షువు దిదృక్షువు
నా మర్మచక్షువు ముముక్షువు

చూడరాని దేదియని
చూడ బోవును
చూపరి చూచెడిదొకటై
చూపు చూచును --

చూచినదే చూడనట్లు
తోచు టేమిటి?
చూడకయే చూచిన
అనుభూతి ఏమిటి?

ఒక కంటికి ఒక కంటికి
భేదన్నది
రెంటిని తూచే కన్ను
వెంట ఉన్నది
నా చర్మ చక్షువు దిదృక్షువు
నా మర్మచక్షువు ముముక్షువు

# ఎవరు ఎక్కిరాలేరని

ఎవరు ఎక్కిరాలేరని
ఏడు కొండలెక్కావా !
ఎవరు పోల్చు కోలేరని
జడరూపం దాల్చావా !

అంతరిక్ష శిఖరం పై
కాంతిగోళముల కావల
విద్విలాస మాడు నిన్ను
హృద్వీధిని నిలుపుకుంటి
ఈ ఎత్తులు ఒక ఎత్తా
ఎరుగవేమొ నా సత్తా --

ఏ రూపంలో ఉన్నా
నీ రూపం కనగలిగే
నా కన్నుల కాంతుల్లో
ఈ ముసుగులు దాగునా
నీ నటనము సాగునా !
మన యోగము ఆగునా !

# దొరకనిది వెదికేటి

దొరకనిది వెదికేటి
దోషమ్ము నాది
తీరనిది కోరేటి
నేరమ్ము నాది -

శిక్షించుమని యంటె
శిక్షించ రెవరు !
రక్షించుమని యంటె
రక్షించ రెవరు !

దొరక కుండుటయే
శిక్షెమొ నాకు
తీర కుండుటయే
రక్షెమొ నాకు -

కోరినది కోరుటే
కోర్కె తీరుటయా
వెదకినది వెదకుటే
వెలుగు దొరకుటయా

తీరని దాహము
తీర్చగల దనుకొని
దొరకని జీవఝరి
వెదకు చున్నానో !

# చుక్కలనే అక్షరాలతో

చుక్కలనే అక్షరాలతో
శూన్యమనే కాగితాలపై
ఏ కవి వ్రాశాడో
ఈ అనంత కావ్యం!

ఎడమ నుంచి కుడికో
కునుండి ఎడమకో
క్రింది నుంచి పైకో
పైనుంచి క్రిందికో
ఏ తీరున చదువాలో
ఈ తారాకావ్యము....

వర్ణమేదో పదమేదో
వ్యాక్యమేదో ఘట్టమేదో
ఏ గుర్తుకు ఏ అర్థమో
దేని కేది అన్వయమో
ఎరుగరాదు, ఏ లిపియో
ఈ లీలాగ్రంథములో......

ఏ మాత్రయో ఏ గణమో
ఏ రాగమో ఏ తాళమో
ఏ శ్రుతియో ఏ గతియో
ఏ భావమో ఏ రసమో
ఏ ఛందోబంధనమో
ఈ సృష్టి సంగీతము...

# నాచేయి నీ చేయిలో

నా చేయి నీ చేయిలో ఉన్నది
నాచూపు నీ చూపులో ఉన్నది
కాని నీవు నాకు కనుపించవైతివి
పంచలోనే ఉండి బహుదూరమైతివి

చేతులు కలిసెగాని
చేతనము వేరేమొ
చూపులవియే అయిన
చూచెడిది వేరేమొ!

చేయూత నిత్తువు
చేసి పెట్టవు నీవు
చూపు ఇత్తువు గాని
చూపించవేమో!

నా నడకలోననే
నీ నడక సాగించి
నా చూపులోననే
నీ చూపు సారించి
నీవు నే నొకటని
నిరూపించ లేవా!

# చిద్రూపధారీ!

చిద్రూపధారీ
అసద్రూపధారీ
రూప గుణ రహిత
పూర్వాపర మురారీ !
ఎటుల దర్శించేది నిన్ను
ఏమి అర్థించేది నిన్ను..

నా కనులు కనలేని
కారు చీకటి వీవు
ఏకనులు కనలేని
కాంతి గోళము నీవు
వెలుగు చీకటి మధ్య
వింతయే నేనా !

నా మాట వినలేని
నారాయణుడ వీవు
నీమాట తెలియని
నరకాయుడను నేను
నీమధ్య నామధ్య
నిశ్శబ్దమేనా !

అడుగ తగినది ఏదో
అడుగ తగనది ఏదో
అడుగ కుండా ముందు
కదు గిడగ లేను
అడుగు అగుడుకు నడుమ
అనుమాన మేలా !

# అనంతగిరిపై

అనంతగిరిపై నాడెందం
అనుభవించినది ఆనందం

సిరిగిరి శిఖరం చేరితిని
సిగలో శశిని ధరించితిని
లింగాపురమున కాపురమై
వంతలు వాగున త్రోసితిని-

శంభునిగుడిలో దూరితిని
డంభములను విడనాడితిని
సిద్ధులపేటను కోరితిని
శ్రీశాలకు బస మారితిని-

పశుపతినై పులకించితిని
పల్లెల పాటలు పాడితిని
కరినగరము తిలకించితిని
మునిజనముల జత కూడితిని -

# దేవుణ్ణి వెదకుతున్న

దేవుణ్ణి వెదకుతున్న
దీపాలేనా
నవగ్రహాలన్నీ
నక్షత్రాలన్నీ !-

అంతరిక్ష కుహరంలో
అలుముకున్న చీకటిలో
ఆది అంతములు లేని
అయోమయా వరణంలో
దేవుణ్ణి వెదకుతున్న...

నాటినుండి నేటివరకు
నలుదిక్కుల చిక్కుల్లో
భయ శంకా చక్రంలో
భ్రమా ప్రమా వలయంలో
దేవుణ్ణి వెదుకుతున్న....

అప్రమేయ శూన్యంలో
అమృతనాద మాలపించి
నీలానంతత్వంలో
నిశ్శబ్దము పాటించి
దేవుణ్ణి వెదుకుతున్న....

దేశకాల ప్రమిదల్లో
దేహాత్మలు వెలిగించి
సత్యానందం కోసం
నిత్యాన్వేషణమేనా !

# సిగ్గవుతున్నది

సిగ్గవుతున్నది నాకు
శ్రీనివాసా
నెరిసిన తల నీలాలను
నీ కీయాలంటే

వన్నె తరగనట్టి కురులు
ఎన్ని సార్లు ఇచ్చానో
తెల్ల బోయినట్టి సిగను
తీసికొందువోలేదో!

నీ కొరకే పోషించిన
ఈ కుంతల నీలాలను
ఎందు కిలా పాడు చేయు
చుందువా గోవిందా !

నా తల లోపలి తలపులు
నీకు కాను పడవలెనని
నల్లని నా తలను, తేట
తెల్లము కావించావో !

మదలో నిను తలచు కొలది
మంచుకొండ నాతల
నల్లమల తెల్లమల
నడి శిఖరము నీవే కద !

# నీలోన దీపము

నీలోన దీపమేలా
వెలుగదో
నాకు సంతృప్తి ఏలా
కలుగదో !

వేల దివ్వెల చూచి
వెకిలిగా నవ్వేటి
చీకటుల పోకార్చు
శ్రీకళిక లేదా
సంతప్త జీవికి
శాంతియే లేదా !

భక్తి ప్రమిదలోన
కర్మ వత్తిని వేసి
జ్ఞాన తైలము పోసి
గట్టి దీపము పెట్టి
కాల గర్భస్థలోకాలు
వెదకుచు నుంటి.

నీ మాట నీ పాట
నీ యాట వెలుగులో
ఓ బాట వెదకు కొను
ఈ బాట పొలికి
నీ రూపమే దీపమా
నిశ్శబ్దమే గమ్యమా !

# నా కొంప నా గడప దాటానయా

నా కొంప గడప దాటానయా !
నీ కొండపై కాలు మోపానయా !
నా ఊరు నా పేరు మరచానయా !
నీ ఊరు నీ పేరు తలచానయా !

నీ ఊరిలో మరల
నా ఊరు కనిపించె
నీ పేరులో తిరిగి
నా పేరు వినిపించె
ఏది ఏదో తెలియదు
నీ తోడ
వాదింప మనసొప్పదు.

కొండలన్నీ ఏడు
కొండలే యనిపించు
బండలన్నిటిలోను
బాలాజి కనిపించు
కొండలకు గుండెలకు కొలికివో నీవు
ఆది అంతము లేని ఆటవో నీవు !

కొండంత నా గుండె
కోతియై చిందులిడు
కడలంత నా తెలివి
బుడగవలె చిట్లిపడు !
ఎంత ఎదిగిన ఫలిత మింతయేనేమో
ఇంత దూరపు యాత్ర
ఇంటికే నేమో !

# కొండ దిగలేడందుకే

కొండదిగలేడందుకే గోవిందుడు
కోర్కెల
కొండ దిగలేడదుంకే గోవిందుడు-

ఉన్న కోర్కెలు తీరుతాయని
కొండపైకి వెళ్ళితే
తీరజాలని కోరికలు నను
చేరి వేధిస్తున్నవి
కొత్త కోర్కెలు కొండమీద
కొండలై పోతున్నవి.

కొండమీద కోర్కెదేవుడు
కొండక్రింద కోర్కెమనిషి
ఒక్క కోర్కెకు పెక్కు పేర్లేమో
పేరు పేరుకు పెక్కు ఊర్లేమో !

తీరకుండని వాంఛలన్నీ
తీయనౌ స్వప్నాలు ఏమో !
తీరిపోయిన కాంక్షలన్నీ
తీయనౌ స్వర్గాలు ఏమో !

# ఎంత అబలవమ్మా !

ఎంత అబలవమ్మా
సీతమ్మా! నీవు
ఎంత అమాయికవో
మాయమ్మా ! నీవు

శివధనుస్సు విరిచాడని
శ్రీరాముని పెండ్లాడి
అయోధ్యకు బదులు, బ్రతుకు
అడవిలోన గడిపావు
ఎంత అబలవమ్మా....

సాకేతము సామ్రాజ్యము
సంతోషముగా వదలి
పైడిలేడి భ్రమలో పడి
ప్రళయం కొని తెచ్చావు
ఎంత అబలవమ్మా...

నిప్పువంటి లక్ష్మణుని
నిందించావు
మాయా రావణుని, దొంగ
మాటలేమొ నమ్మావు
ఎంత అబలవమ్మా....

మట్టిలోన పుట్టావు
మ్రాకు వోలె పెరిగావు
వలచిన పతి చేతిలోనె
వంచన పాలయ్యావు
ఎంత అబలవమ్మా...

# ఎన్ని అనుభవాలైనా

ఎన్ని అనుభవాలైనా
ఎన్ని జ్ఞాపకాలైనా
శలభములై కాలిపోవు
చిత్రమైన మరుపులో-

నిన్నను దిగ మ్రింగుతున్న
నేడే నా మరుపు
నేడును నిన్నగ చేసే
రేపే నా మరుపు-

ఆకాశం ఖండించే
అనుభూతులు అన్నీ
మరుపు కడలిలో కూలి
మాయమౌను ప్రతిరోజూ-

మరుపే మనుగడ మనిషికి
మరుపే ప్రాణం సృష్టికి
మరుపే మనిషిని మరచిన
మనిషే మరుగై పోవును-

# ఏడుకొండల వేంకటేశా !

ఏడు కొండల వేంకటేశా !
హేమ హాసరమా విలాసా !

నేల కందక నింగి కందక
లీలగా ఈ గాలి మేడల
నీకు నీవే వెలసినావో !
లేక ఎవరో నిలిపినారో !

ఎన్ని కొండలు లేవు, దేవత
లెందరెందరు వెలయలేదు
ఎవరి నమ్మక నేను నిన్నే
ఏల నమ్మితి తెలియరాదు.

ప్రేమమన్నది స్నేహ మన్నది
నా మతముగా చేసికొంటిని
ఆ మతానికి నీవె రూపము గా
మదిని భావించుకొంటి ?

నమ్మదును పరిణామ వాదము
నమ్మదును హరినామ వేదము
చదివి నేర్చి పదార్థ జ్ఞానము
వెదకుచుంటిని ఆత్మ జ్ఞానము.

నేను స్వయముగ పుట్టలేదు
కాన చావక ఉండలేను
చావులేని స్వయంభు వీవు
చచ్చినా నిను వీడలేను.

# సత్యం కోసం వెదకితె

సత్యం కోసం వెదకిత
మృత్యువు దొరికిందా !
ఆనందంకై వెదకితె
ఆవేదన దక్కిందా !

మృత్యువు సత్యముకాదని
మూల్గెదవేలా
ఆనందం ఆవేదన
ఆమ్రేడితమే కాదా !

ఏదిమార్గ మేదిగమ్య
మేది సత్య మేది మృత్యు
వేది ఏదియో నీకు
ఎరిగించే దెవరో !

ప్రశ్న వీవె, మరచిపోయి
ప్రశ్నించే వాడవీవె
సమాధానము నీవే
సమాధానమిడెదవీవె.

వెదకే వాడవు నీవే
తుదకు దొరకునది నీవే
దొరకినది పోగొట్టుక
వెదకే వెర్రివి నీవే !

# కొండపై నా గుండె

కొండపై నా గుండె
కోటి పడగలు విప్పె
కోనలో నా బ్రతుకు
క్రొత్తరూపము దాల్చె-

నన్ను చూచి నేనె
కెవ్వుమన్నాను
నన్ను చూచి నేనె
నవ్వుకున్నాను-

పాము నేనైనట్లు
భ్రాంతి చెందాను
స్వామి నేనైనట్లు
స్పందించినాను-

రాతి కొండకు అంత
చేతనము ఎచటిదో !
చిరుత కోనకు ఇంత
చిత్రకళ ఎచటిదో !

పాము, స్వామి కలిసి
పరమాత్మ ఏమో
బాపురే నా రూపు
భావాత్మ ఏమో !

# నమ్మను నమ్మను

నమ్మను, నమ్మను, నమ్మను
నీవున్నావని నమ్మను
బొమ్మను బొమ్మను బొమ్మను
దొరికీ దొరకని బొమ్మను...

నమ్మినవారికి, నమ్మని వారికి
న్యాయం చేసే నాధుడు కలడని
అడిగిన వారికి అడగనివారికి
ఆశలు తీర్చే ఈశుడు కలడని
నమ్మను నమ్మను......

తెలిసిన దానికి తెలియని దానికి
తెలిసీ తెలియని తీరము కలదని
ఉండియు లేని, లేకయు ఉండిన
నిత్యానిత్య సత్యము కలదని
నమ్మను నమ్మను....

నీవే నేనని నేనే నీవని
అదియే ఇదియని ఇదియే అదియని
అద్వైతంలో ఆనంధించుట
అన్ని ప్రశ్నలకు సమాధానమని
నమ్మను, నమ్మను.....

# కాలమే సర్పమై

కాలమే సర్పమై
కాటువేసిన వేళ
రక్షించుమని ఎవరి
ప్రార్థింతును?

నేలపై నింగిపై
నీటిలో గాలిలో
ఎందు దాగిన నన్ను
ఎందుకో పసికట్టి
కాలమే సర్పమై...

నను కన్న తల్లియని
నా కాంతి వల్లియని
అందరికి అన్నిటికి
ఆధారమనుకున్న
కాలమే సర్పమై ....

దగ్గరకు పోకొలది
దవ్వు దవ్వైపోయి
దవ్వులకు పోకొలది
దగ్గరగ నను చేరి
కాలమే సర్పమై...

ఆది అంతములేని
ఆనందజలధిలో
తేలిపోయే బ్రతుకు
తెరచాపనౌ నన్ను
కాలమే సర్పమై .....

# ఆలోచనము లేని

ఆలోచనము లేని
అనుభూతిలోన
లీనమై పోయేటి
లీలనై పోతి !

వాదమ్ము లేనట్టి
మోదమ్ములోన
పరవశించిన కలల
పాటనై పోతి-

ఏ దిక్కు లేనట్టి
పాథోధి లోన
నా దిక్కు నేనెయౌ
నావనై పోతి-

ఏ వైణికుడు లేక
యే, మ్రోగు వీణపై
సప్త స్వరాతీత
సంగీత మైతి-

ఏ భాషకందని
ఏదో భావకాంతికి
రోదసీ శోధనా
వేదాన్తమైతి-

# వెన్నెలాడి చుక్కవైపు

వెన్నెలాడి చుక్కవైపు
కన్నుగీటనా !
పసిడి బొమ్మ మింటికొమ్మ
పైటలాగనా !

నన్ను పట్టుకోలేవని
మిన్నులోన మిడిసిపడే
తారామణితో, నే
శృంగారమాడనా !

పగలంతా జిలుగు వెలుగు
పరదాల వెనక దాగి
చీకటిలో నా కన్నుల
చిద్విలాసమా !

కండనిండ బలముంటే
గుండెనిండ ప్రేముంటే
విజ్ఞానపు రెక్కలతో
వినువీధికి రమ్మంటే
వెన్నెలాడి చుక్కవైపు కన్నుగీటనా !

ఎన్ని తెలుసుకున్నా
నన్ను తెలుసుకోలేవని
అంగారము శృంగారము
రంగరించు రాగమయి
వెన్నెలాడి చుక్కవైపు కన్ను గీటనా

# నీ ప్రేమముందు

నీ ప్రేమముందు
నేనో తృణమ్మై పోదు
నీ కోపశిఖల
నేనో సమిధనై పోదు-

ప్రేమించినా సరే
కోపించినా సరే
ఎట్టైన నీ పూజయే
నా ఫలముగా !

తిట్టినా నీ పైన
తిరగబడ లేనుగా
పెట్టినా నిను పొగడు
శక్తి యే లేదుగా !

ఏల ప్రేమింతువో
ఏల కోపింతువో
ఎపుడేమిసేతువో !
ఎరుగనీయవుగా

ప్రేమించునపుడు నే
వికసించి చితుకుదును
కోపించినపుడు నే
ముకుళించి బ్రతుకుదును

# వీణలేని వైణికుడను

వీణలేని వైణికుడను
రథములేని సారథిని–
మ్రోగింతును
మౌన భావతంత్రులను
నడిపింతును
దేహాత్మాశ్వములను–

నేలయైన నింగియైన
గాలియైన నీరైనా
స్పర్శించిన మాత్రాన
స్పందించును మహతివోలె–

కలయైనా నిజమైనా
గతమైనా భావియైన
సైగచేసినంతలోనె
సాగివచ్చు స్యందనమై–

వీణకొఱకు చేయిసాచ
నా పాణియె వీణయయ్యె
రథముకొరకు పథము వెదక
నా చూపే రథమయ్యెను–

# ఉన్న కోరికలు తీరక

ఉన్నకోరికలు తీరక
కన్నుమూసుకుంటె
లేని కోరికలు వచ్చి
లేపుతున్నవి, నన్ను
ఊపుతున్నవి-

కావలెనను కామన
కాల్చును నన్ను
కాకూడదనే కాంక్ష చీల్చును
నన్ను వేల్చును

ఒక్కవాంఛ తీరనట్టి వైనమే
రెండు వాంఛలై లేచును గుండెలో
నాగుండెలో-

ఎక్కడపుడతాయో ఈ కోరికలు
నా హృదయారామ రాగ శారికలు
ఉపచారికలు-

తీరని కోరిక లెంతో తీయనేమో !
వాంఛ తీరినదనుకొనుట భ్రాంతియేమో
ఉపశాంతి యేమో !

# ఒక సత్యము స్వప్నమాయె

ఒకస్వప్నము సత్యమాయె
ఒక సత్యము స్వప్నమాయె
సత్యం స్వప్నం కలిసి
నిత్యజీవితమాయె-

జలధులెగసి ఝురులాయె
ఝురులు సాగి జలధులాయె
జలధులు ఝురులు కలిసి
జగతికి జీవమాయె-

నరుని సృజించెను హరి
హరిని సృజించెను నరుడు
హరినరులు కలిసిపోయిన
ధరణి స్వర్గమైపోయె-

కాంతి ఆరి ధ్వాంతమాయె
ధ్వాంతమారి కాంతి ఆయె
కాంతి ధ్వాంతములే, దేశపు
కాలపు రూపములాయె-

నీవు తరిగి నేనాయె
నేను పెరిగి నీ వాయె
నీవు నేను కలిసినప్పుడు
నింగినేల ఒకటాయె-

# పాడినపాటే పాడే

పాడిన పాటే పాడే
పామరుడను నేను
ఆడిన ఆటే ఆడే
సోమరిని నేను–

ఏ భావ కిరణమైనా
ఆ నీరధినే దూరును
ఏ రాగ తరంగమైన
ఆ తీరమే చేరును–

ఏ వాద్యము వాయించిన
ఆ వంశీనాదమే
ఏ భంగిమలో ఆడిన
ఆ తాండవ నాట్యమే–

ఏ దారిని పోబోయిన
ఆ తారాపథమే
ఏ యాత్రకు ఏ పాత్రకు
ఆ సారథి రథమే –

ఏ వాణి పలుకబోయిన
ఆ వీణాగానమే
ఏ గుణితము ఏ గణితము
ఆ పూర్ణ ఫలితమే–

# చుక్కల సాగరంలో

చుక్కల సాగరంలో
చక్కని జాబిల్లినౌక
సాగుతుంటె, నా మనసు
ఊగుతున్నది-

అంతరిక్షమంతా నా
అంతరంగమై పోయె
దేశకాలములు నా
కర దీపికలై పోయె-

వెలుగులోన కానుపడని
వింతవింత లోకాలు
చీకటి తెరపై, భలే
చిత్రంగా వెలిగాయి-

చూపు పైకి లేపగానే
దీపకోటి వెలిగింది
మనసు తలుపు తీయగానె
మహామాయ తొలగింది-

తారావీచికల మీద
తడబడు అనుభూతినౌక
ఏ తీరున సాగునో
ఏ తీరము చేరునో

# భావ భౌతికావాది నేను

భావ భౌతిక వాది నేను
రోదసీగతి వేది నేను-

భావమనియెడు కాంతిలేక
భౌతికం కనిపించదు
భౌతిక స్థితి లయములేక
భావమే ప్రసరించదు-

ఉన్నదనుకొను భావమందే
కన్ను విప్పును లోకము
లేదు లేదనుకున్న వానికి
లేదు ఏదీ ఎక్కడా-

భ్రాంతిలో ఉదయించుభావం
భావమున నిజమౌను భ్రాంతి
భావభ్రమర భ్రమావరణలో
భౌతికాకృతి జీవకాంతి-

# భద్రాచలరామా

భద్రాచలరామా
నా భద్రత నీ భారమురా
నీ ధామము, నా బాధల
గోదావరి తీరమురా !

కామ క్రోధాలు నను
కష్టాటవి త్రోసెనురా
ఇహశాంతి సుఖాలకు
బహు దూరము చేసెనురా

లోభ మోహములు ఏమో
నాబుద్ధిని కొల్లగొట్టె
మమతకై తపించు నన్ను
మాయదారి పట్టించె
భద్రాచల రామా !...

మద మాత్సర్యములు, నా
మనుగడనే చెర బట్టెను
సత్యముకై వెదకు నన్ను
సంహరింప తలపెట్టె

నీ కరుణా పుష్పకమున
నాకు కాస్త చోటీరా
చిదానంద అయోధ్యకు
శీఘ్రమ నను కొనిపోరా
భద్రాచల రామా !....

# చుక్కలనే కళ్ళతో

చుక్కలనే కళ్లతో
చూస్తున్నది కాలం
శూన్యమనే కడలిని
శోధిస్తున్నది కాలం

క్షణమైనా ఆగకుండ
సాగిపోతున్నది
ఏ గమ్యం లేకుండా
ఎగిసిపోతున్నది
చుక్కలనే కళ్లతో....

దిక్కులేని భూగోళం
బిక్కు బిక్కు మంటూంది
వెలుగు చీకటుల వలలో
విల విల లాడుతూంది
చుక్కలనే కళ్ళతో...

గతము, భావి, ఆది, తుది
స్థితిలయములు లేవు
అనంతమను భావనకే అర్థమ్ము లేదు
చుక్కలనే కళ్లతో.....

దేశ కాలములు తమకే
తెలియక తడబడుతుంటే
ఎంతో తెలిసినట్టు
గంతులు వేయును నరుడు
చుక్కలనే కళ్లతో.....

# వెలుతురు కోసం

వెలుతురు కోసం వెదికే
వె్రి చీకటీ !
నీ కను రెప్పల క్రిందే
దీపమున్నదే-

కళ్లుమూసుకొని
ఎందుకు
కాంతికై తపిస్తావు
కాళ్లు కట్టి వేసుకొని
కదల లేనంటావు-

భయం అనే బడిలోన
బానిసత్వ భాషలోన
కష్టాలే చదివి చదివి
దృష్టి కోలుపోయావా !-

ఆకలికి ఓర్వలేక
హక్కుల దివ్వెలు మ్రింగ
బ్రతుకే కనిపించదని
బాధపడే కబోదీ !

# మూర్ఖులు మూడు రకాలు

మూర్ఖులు మూడు రకాలు
అందరికీ అధినేత నేనే-

కలడని భావించే వారు
లేడని వాదించేవారు
ఉన్నాడో లేడో అంటూ
ఊగులాడు వారు
మూర్ఖులు మూడు రకాలు-

కలడని తలపోసే వారికి
కనపడ్డది లేదు
లేడని ఎదిరించేవారికి
లేని బుజువు లేదు
కలడో లేడో అనుకుంటే
కలుగు ఫలం లేదు-

కలడన్నా లేడన్నా
కలడో లేడో అన్నా
కలవాడు లేకపోడు
లేనివాడు లేచిరాడు-

కలడంటే లేడంటాను
లేడంటే కలడంటాను
కలడో లేడో అంటే
కలయే నిజమౌనంటాను-

# గుర్తు చేయమని

గుర్తు చేయమని నిన్ను
కోరికోరి ప్రార్థిస్తే
మరిపిస్తున్నావా నను
మాయా మయ సఖుడా !

చదువుకున్న దెల్ల నేను
నిదురలోన మరచిపోదు
నిదురలేని వాడవని
నిదురలేచి నిన్నడుగగ
మరిపిస్తున్నావా నను
మాయా మయ సఖుడా !

ఒకటి చూచి కలయనుకొని
ఒకటి చూచి నిజమనుకొని
ఒకటి కొకటియని భ్రమపడి
ఉక్కిరి బిక్కిరి యౌదు.

తర్కించగ తర్కించగ
తళుక్కుమను సత్యాలు
పరిభాషా పటిమలేక
పలుకలేను, వ్రాయలేను.

ఆదిలేని తుదిలేని
వాదనలో పడిపోయి
నను నేనే మరచిపోదు
నిను పిలుచుచు నిదురపోదు-

# చమురులేని ఈదీపం

చమురులేని ఈ దీపం
చల్లారదు ఎందులకో
తీగ తెగిన ఈ వీణియ
మ్రోగునింక ఎందులకో !

పయోనిధి సమాధికై
పరుగిడి వచ్చిన నదులు
తిరిగిపోవ ఎందులకో
తీవ్రముగా యత్నించుచునుః
కాటిలోన కూడ బ్రతుకు
బాటవైపు ఆకర్షణ
ఈ జీవన్మరణ సంధ్య లో
జిజీవిషా జిగీష

అబ్బా ! ఈ లోకమెంత
ఆశాభావోన్మాదిని
రాబోయే రవి కోసం
రాత్రి ఎట్టిదేని సైచు

బ్రతుకు తీరమున నాలో
భాసించిన భావమేదో
పొంగి పొంగి అక్షరాను
భూతి గీతమై పోయెను

# ఎన్ని పాటలు

ఎన్ని పాటలు నిన్నుగూరిచి
ఏడు కొండల వెంకటేశా !
అన్ని పాటలు మరచి నీవే
అక్షరాలుగ పాట వ్రాతును

అక్షరము నీవైనచో, నే
లక్షలక్షల పదములల్లుదు
పదపదము నీ పాదమైతే
ప్రణవయాత్రకు బయలుదేరుదు-

ఛందమేదో శబ్దమేదో
రాగమేదో భావమేదో
ఆదియేదో అంతమేదో
ఏదియేదో తెలియరాని
నాదమే నా నవ్యకృతిగా
నాకు నేనర్పించుకొందును.

నీవు నీవే పాటవైతే
నీవె నామది మాట వైతే
వెఱ్రిపాటలు వేయి ఏలా
వెంకటేశా చిద్విలాసా

# పేరులేని పెన్నిధికి

పేరులేని పెన్నిధికి
పెక్కు పేర్లు పెట్టాను
పేరు పేరు వేరనుకొని
పెనుగులాడుతున్నాను-

పేరు వేరు వేరు గాన
ఊరు కూడ వేరనుకొని
ఏ ఊరున ఏ పేరున
ఏ తీరున పిలవాలో
ఎరుగలేక తిరుగుచుంటి-

ఇది కాదని అది కాదని
ఇది అది  ఏదీ కాదని
దారి యేదొ పోల్చలేక
దారే లేదనుకొందును
దారి వెదుకుచునె ఉందును-

దారిలేని తీరానికి
దారులన్ని చేరునని
తెలియని దారిన పోయే
తెరవరినే నేనా
ఈ భ్రమా భ్రమర భ్రమణకు
ఏ గమ్యము లేదా !

# శాశ్వతము ఈశ్వరత

శాశ్వతము ఈశ్వరతరా !
విశ్వాన
ఈశ్వరత శాశ్వతమురా !
శాశ్వతము అనుకొనే ఐశ్వర్యములు,
కాలి వైశ్వానరజ్వాలికల
కాలిపోవురా !

శాశ్వతత ఉచ్ఛ్వాస
ఈశ్వరత నిశ్వాస
చేసుకొని బ్రతుకుటే
చేతనా శక్తి రా
జీవద్విముక్తిరా !

ఆనంద తత్త్వమే
ఆద్యంత సత్యము
సత్య స్వరూపమే
సగుణ బ్రహ్మత్వము
శాశ్వతము బ్రహ్మత్వము
సగుణ నిర్గుణ తత్వము-

విశ్వాస శైలజా
విదిత విశ్వేశ్వరుని
విశ్వ నిశ్వా సాశ్వ
విచలితానందాత్మ
చక్రమే శాశ్వతమురా
శాశ్వతము ఈశ్వరతరా.....

# ఉన్నాదంటే ఉన్నదిలోకం

ఉన్నాదంటే ఉన్నదిలోకం
లేదంటే లేదు
ఉందా లేదా అన్న వివాదం
ఈనాటిది కాదు-

ఆది శంకరుల మిధ్యా వాదం
ద్వైతాద్వైత విశిష్టాద్వైతం
భౌతిక వాదం, భావవినోదం
ఏదెట్లున్నా ఎవరేమన్నా
ఉన్నాదంటే ఉన్నది....

బ్రతుకుకు అర్థం
చావుకు అర్థం
వెతికి వెతికి వేసారుట ఏల ?
స్వర్గం నరకం పాపం పుణ్యం
చర్చలలో పడి చచ్చుట ఏల ?
ఉన్నాదంటే ఉన్నది....

కాలమనంతం
దేశమనంతం
'గతము భావి
స్థితిలయములనంతం
బాపురె బాపురె ఇదివేదాంతం
ఉన్నాదంటే ఉన్నది.....

# హిమగిరి చెవిలో

హిమగిరి చెవిలో
గంగాఝురి గుసగుసలాడింది
నాకోసం సరిక్రొత్త
ఆకాశం వెలిసింది.

కరిగిపోవు మంచులో
కాలం కనువిప్పుతోంది
పదపదమున భావికి
గతపాఠం చెప్పుతోంది
హిమగిరి చెవిలో.....

హృషీకేశిలో జీవము
ఋషిత్వం పొందింది
హరిద్వారలో అహమును
అర్ఘ్యముగా వదలింది
హిమగిరి చెవిలో....

శ్వేతగంగ నీలియమున
చేయిచేయి కలించి
ఆత్మానందమున తేలె
అలహాబాదాంకంలో
హిమగిరిచెవిలో...

సమతా జలధులు వెదకే
మమతా సంగీతధునుల
కలిసిపోయె నాలోగల
క్రాంతి భావనా ఝురులు

# అన్నిటికన్నా

అన్నిటికన్నా
మిన్నై ఉన్న
పెన్నిధి సన్నిధి
చేరేదెట్లో! ఈ చీకట్లో

లేనిదానికై
వెదకే వానికి
ఉన్నవాడు చే
యూత నీయడా
ఉన్నది కూడా
ఉన్నవానికే
పన్నుగ అర్పించాలా !
అన్నిటికన్నా.....

ఉన్నాడనుకొని
కలయజూచితే
కానుపించునది
కారుచీకటే
లేదు లేదు అని
కనులు మూసితే
వింత వెలుగెదో
విప్పు నా కనులు
అన్నిటికన్నా.....

# రంగనాథా

రంగనాథా
అంతరంగ నాథా
వాక్తరంగాలపై తేలిరావా !
భావశృంగాల తేరెక్కిరావా !...

నీకోసమే నేను
ఈ కాల తటముపై
మట్టి గోళపు, బల్ల కట్టుపై కూర్చుండి
వేచియున్నాను రారా, నను నీవె
చూచి గుర్తుంచుకోరా !...

ఏదారియో తెలియరాదురా నీదారి
నాదారి మాత్రమీ రాదారియే రా
నా దారినే వచ్చిపోరా, నన్ను
నీ దారిలో కొంచుబోరా !....

చుక్కలను లెక్కిస్తు
శూన్యమ్మును కొలుస్తు
నాలోన లోలోన నీ లీల లూహిస్తు
వెర్రి కేకలు వేయు
వెంగళప్పను నన్ను
దరిజేర్చు వేళాయరా
తాపత్రయము చాలురా !...

ఏతరగ లేచినా ఏగాలి వీచినా
ఏ పూవు పూచినా ఏవెలుగు తోచినా
నీ రాకె అనుకొందురా, నిట్టూర్చి
నీవె నేననుకొందురా !

# శ్రీ రామచంద్రునికి

శ్రీరామచంద్రునికి
అరణ్యవాసం
పేదరక్షలకేమో
పట్టాభిషేకం—

శక్తిని దిగమ్రింగె
యుక్తి చాతుర్యం
హక్కులను మ్రింగె
కైపెక్కిన స్వార్థం
శ్రీ రామచంద్రునికి ..

ఆత్మాభిమానము
అడవిపాలాయె
సీత నిజాయితీ
సిదురపాలాయె
శ్రీ రామచంద్రునికి ...

మమత ఏడ్చి ఏడ్చి
మట్టినాలాయె
బ్రతుకు బాధల గాధ
ఇతిహాసమాయె
శ్రీరామచంద్రునికి ...

# పాములనాడించు

పాముల నాడించుకొంచు
బ్రతుకుచుంటి నేను
విషజీవుల విశ్వసించు
వింత మనిషి నేను-

ఊహోరగములు ఎదలో
హూంకరిస్తుంటే
ఆది శేషువును వెదికే
ఆర్భకుడను నేను-

కష్ట ఫణులు నా కంఠం
కట్టివేస్తుంటే
కాలాహిని పట్టజూచు
కర్మఠుడను నేను-

పన్నాగ పన్నగాలు
నన్ను కాటేస్తుంటే
కాళీయ ఫణాగ్రంపై
తాండవ మాడేను-

నా బ్రతుకే నాగినియై
నాట్యమాడుతుంటే
నేనే నాగ స్వరమై
నినదించేను-

# వేల వేద వీణలు

వేల వేద వీణ లొక్క
వేణువులో పలికించే
బృందావన స్వామి, నా
డెందములోనే నిలిచే-

వెర్రినయ్యి నేనాతని
వెదకితి యమునా తటిపై
చింతించితి ఆతనికై
చీకటి కంకటిపై-

ఊహల రెక్కలు కట్టుక
ఉడు పథాల గాలించితి
అంతరిక్షమౌళిని, నా
అంతరంగమున కంటి-

ఎచట ప్రేమ వికసించునొ
అచట తాను పరిమళించు
ప్రేమించిన వారందరి
ప్రియతముడై పలకరించు-

ఒక్కరి ప్రేమించ తగిన
శక్తిలేని దాన నేను
ఎందరి ప్రేమార్తులైన
అందుకొనే స్వామి అతడు-

# ఏడుకొండలమీద ఎన్నాళ్లవాసమో

ఏడుకొండల మీద
ఎన్నాళ్ల వాసమో!
ఆది దేవుని కసలు
ఏది వైకుంఠమో !

కలవంటి దేవుడు
శిలయయ్యెనో, లేక
శిలవంటి దేవుడే
కలయయ్యెనో !

వైకుంఠ మిదియని
వచ్చాను తిరుమలకు
దిక్కు నీవేయని
మ్రొక్కాను ఓ శిలకు-

గుడిలోని శిల్పాలు
గుర్తించినవి నన్ను
ప్రశ్నలేవో అడిగి
పక్కుమని నవ్వినవి-

నమ్ముదునా నిను నేను
నమ్మనో తెలియక
నవ్వుల పాలైతినని
నవ్వెనో ఆ శిలలు-

# నీ చూపులలో ఇల్లు

నీ చూపులలో ఇల్లు
కట్టుకొంటిని
నీ నవ్వులలో దీపం
పెట్టుకొంటిని-

నీవే నావెలుగైతివి
నీవే నా నీడవు
అయినా నన్నెరుగనట్లే
అగుపించే జాడవు....

నీలో నేనున్నట్లు
నిన్న కళ్ళలు కంటిని
నాలో నీ వున్నావని
నేడు తెలుసుకొంటిని....

కాంతి కొఱకు వెదకి వెదకి
కన్ను మూసితి
నన్ను కనులు చేసుకున్న,
నిన్ను చూచితి....

# ప్రణయగీతులు వ్రాసి

ప్రణయగీతులు వ్రాసి
ప్రగతి గీతులు వ్రాసి
ప్రణవ గీతాలతో
పరవశిస్తున్నాను-

చెలిప్రేమలో నేను
చేతనాబ్ధము నైతి
మనిషికోసం కూలి
మట్టిలో పొరలితిని-

గాలికై మీటిన
గాంధర్వ రాగాలు
నైలకై చేసిన
నిర్వేద త్యాగాలు
మూటగట్టుక నేడు
మునిగితిని భావాబ్ధి-

రాగమ్ము లేనిదే
త్యాగమ్ము లేదురా
త్యాగమ్ము లేనిదే
భోగమ్ము లేదురా
భోగమే ఓంకార
యోగమని తెలియరా !

# నను పిలువ వచ్చిన

నను పిలువ వచ్చిన
నా మృత్యురాణీ !
పయనమయ్యే ముందు
పాటొకటి రాయనీ !

ప్రతి త్రుటిని శ్రుతిచేపసి
పాటలప్పి వ్రాసి
ఇంకేమి వ్రాయునని
శంకించు చుంటివా !

అవును నే వ్రాసినవి
అగణితమ్ములు నిజమె
గణితమ్మునకు వచ్చు
గీతమిప్పుడు వ్రాతు -

తెలియనివి తెలిసినటు
తెలుపు పాటలవన్ని
తెలిసియును తెలియదని
తెలుపుపాట ఇది-

పాట అంటే మరేదో
పాట కాదమ్మా !
సోహమని నీకు
దాసోహమను పాట-

# కనకమహాలక్ష్మి

కనకమహాలక్ష్మి ! కన్న తల్లి లక్ష్మి
విశాఖపట్టణ వీధిని వెలసిన
విజయ శ్రీలక్ష్మి!
విశాల సాగర గర్భం నుండి
వెడలిన భూలక్ష్మి!

అడిగిన వారికి లేదనకుండా
అన్నం పెడతావు
నమ్మిన వారికి కాదనకుండా
న్యాయం చేస్తావు
భక్తులందరికి మితి లేకుండా
భాగ్యము లిస్తావు -

శ్రీవిద్యా శివ సుందర బాలా!
జీవన మారుతరాజిత హేలా !
ప్రణవశక్తి దేవీత్రయ లీలా !
కామితార్థములు తీరుస్తావు
లేమిని ఎల్లెడతొలగిస్తావు
కష్టాలన్నీ కన్నీళ్ళన్నీ
కనిపెట్టుచు కడతేరుస్తావు -

నీ చిరునవ్వులు మా సిరులమ్మా
నీ కరుణా రుచి మా తెరువమ్మా
నీ కరములు శుభకరములు మాకు
నీ వర రూపము దీపము మాకు
నిద్దురలేని నీ కనుచూపులు
భద్రత కూర్చే వరములు మాకు

# కొండ మీద కొలువు

కొండ మీద కొలువున్న
కోదండ రామా!
సీతా లక్ష్మణ సమేత
శ్రీరామ నామా!

వేదనాద గోదావరి
వేసినట్టి భద్రాచల
పీఠముపై కల్యాణ
ప్రియానంద రామా

భక్తి ఫలముగొని శబరికి
ముక్తినిడిన రామా
ధర్మం కోసం సర్వం
త్యాగం చేసిన రామా

భక్త రామ దాసిచ్చిన.
బంగారు పతకాలు
తానీషా అర్పించిన
తరళతారముత్యాలు
మరచి పోని మతాతీత
మానవోత్తమా రామా!
బాధాతప్తుల పాలిటి
భవ భయ తారకరామా!

# నీ మాట నా నోట

నీమాట నానోట
పలికించవా స్వామి
నీ కరుణ నా మీద
చిలకించవా స్వామి !

మాటాడవైన, మై
మరిపించు నీరూపు
"తత్వమసి" సత్యములు
తలపించు నీ చూపు
తెలియజాలని నిన్ను
తెలిసికొాను టెట్లో !

సప్తగిరి శిఖరాల
దీప్త శిలవై వెలసి
నీల గగనము నుండి
లీలగా నను పిలిచి
మాట్లాడవేమి, నా
మాటేమిటయ్యా !

చెప్పుమా నీ గుట్టు
చెప్పుమా నా గుట్టు
చెప్పు సూటిగ నాకు
చిరునవ్వు నవ్వకు
చెప్పరానిది చెప్ప
సిగ్గేమొ నీకు

# కన్నుల్లో వెలసిన

కన్నుల్లో వెలసినట్టి
కలియుగ జగదీశ్వరా!
సప్తగిరులు దిగివచ్చిన
సాగర-వేంకటేశ్వరా !

మా గుండెలు కూర్చి పేర్చి
నీ గుడిగా తీర్చినాము
కొలువుండుము స్వామీ ! మా
కోర్కెలవే తీరిపోవు

మా కలల కడలి తరగలు
నీ కీర్తనలే పాడును
మా బ్రతుకుల దారులన్ని
నీ మందిరమే చేరును

మా ఆశలు ఆశయాలు
నీ ఆరాధన కొరకే
మా బాధలు భయాలు
నిన్ను చేరుకొను వరకే

మా భక్తి ప్రపత్తులన్ని
నీ శక్తికి దీపాలే
మా ఆనందములన్నీ
నీ అనంత రూపాలే

కాలాతీతుడ వైన
బాలాజివి నీవే
సాకార నిరాక
సత్యము నిత్యము నీవే

# అన్నమయ్య పాట

అన్నమయ్య పాట,
ఆత్మకన్నమయ్యా !
అన్నమయ్య బాట
బ్రతుకు పున్నెమయ్యా !

అదిగో అల్లదిగో అని
హరివాసము చూపించెను
అలిపిరి జీవులకు, శక్తి
అక్షరాల నేర్పించెను.

మధుర భక్తి పాలు పోసి
మాధవున్ని పోషించెను
వేదాంతము నూరిపోసి
మనిషి వెతలు తొలగించెను

కొండలలో నెలకొన్న
కోనేటి రాయనితో
పెట్టిన ముచ్చట్లు విన్న
రాళ్లే సెలయేళ్లయ్యెను
ఆకులు కోకిల అయ్యెను
గాలే రాగాలయ్యెను
మూర్తులు కీర్తనలయ్యెను.

# యాదగిరి గుట్టపై

యాదగిరి గుట్టపై
వేదహరి నాదమై
వినిపించు లక్ష్మీ నృసింహా !
కనిపించు సగుణ పరబ్రహ్మా !

దౌర్జన్యముల ఒక్క
గర్జతో అణచేటి,
మేటి రాక్షసుల, కొన
గోటితో చీల్చేటి
శక్తినీకే గలదు శ్రీ నారసింహా!
యుక్తి నీకే తెలుసు ఉగ్రనరసింహా!

హింసకుటిలత్వము హిరణ్యకశిపత్వమై
భక్త జన ప్రహ్లాద బాధక స్వార్థమై
మెట్టుచున్నది మట్టు పెట్టుమో స్వామీ
నీ గట్టుపై నుండి కనుపించనిది ఏమీ

సిరులన్ని, సౌఖ్యాల
విరులన్ని, నీయాద
గిరి మీద పుట్టినవె
సరిలేని నరకేసరీ!
కరుణించుమో శ్రీహరీ !

# మెట్టు మెట్టు

మెట్టు మెట్టు స్వామీ, నీ
గుట్టు గురుతు చేస్తున్నది
గట్టు గట్టు కొసల గురుతు
మెట్టు మాయ మౌతున్నది

గాలి గోపురము మీద
కట్టు కింటి నా గూడు
ఏ దిక్కున ఎగరాలో
ఎరుగ నీదు కనుకట్టు

కపిల తీర్థము నుండి
ఆకాశ గంగ వరకు
పాప వినాశన మార్గము
వెదకి వెదకి వేసారితి

ఎన్ని అడుగు లెక్కవలెనో
ఎన్ని గుడుల మ్రొక్క వలెనో
నా అలిపిరి ఊపిరులు
నీ పదముల చేరుకొనగ

అన్నమయ్య ఏదారిని
నిన్ను చేరుకున్నాడో !
అడుగు జాడలేవి, కాను
పడవీ కారడవిలోన

# త్రిలింగ దేశాధీశా!

త్రిలింగ దేశా ధీశా ! ఈశా
త్రిలోక వాసా ! ఫణి భూషా

హర హర, భయ హర, హర గంగాధర
హర హర, శుభకర, శంభో శంకర
హర హర, శశిధర హరశక్తీశ్వర
హర హర, విషగళ, హరముక్తీశ్వర

శ్రీకాశీ పతి, కైలాస పతీ
శ్రీగౌరీ పతి, కళ్యాణ మతీ
శివశివ హర హర శ్రీశైల పతీ
శ్రీకాళహస్తి క్షేత్ర పతీ ।

వేముల వాడలో శ్రీరాజేశ్వర
మహాదేవపుర శ్రీకాళేశ్వర
దాక్షారామంలో శ్రీ భీమేశ్వర
అమరావతిలో శ్రీ విశ్వేశ్వర

జటా జూట, జీవన గంగాధర
నిటాలాక్ష మృత్యుంజయ శంకర
రక్షించుమురా । అభయ త్రిశూలా
రవళించుమురా । అకాండ తాండవా
సౌఖ్యానందక సాంబశివా!
ఓం నమశ్శివాయా ! ఓం నమశ్శివాయా

# నా గుండె గుడిలో

నా గుండె గుడిలో కోదండరామా !
నా భక్తి బడిలో ఆనందరామా!

అమ్మకు దూరమైనట్టి రామా
సీతమ్మకు దూరమైనట్టి రామా
నా సత్య సాహిత్య నిత్యార్చనములో
అమ్మ సీతమ్మను అరయుమోరామా

సౌఖ్యాలువీడిన సద్గుణ రామా
సాకేతమును విడిన సత్కీర్తి రామా
నా కష్ట నిష్ఠూర కాంతార సీమ
కట్టిన పర్ణశాలకు రమ్ము రామా !

దనుజుల దునిమేటి ధైర్య రామా!
మనుజుల రక్షించు మధుర నామా!
దానవత మానవత భావనల కావల
దైవత్వ శిఖరాల చేర్చురామా!
తారక జ్ఞాన ప్రమోద ధామా!

# గోదావరి తీరవాసినీ !

గోదావరి తీరవాసినీ !
విద్యావీణా విలాసినీ !
సకల కళా కుసుమహాసినీ !
వాసర సుర సుధాభాషిణీ !

కోవెలలో కూరుచుండి
కు వలయాన్ని నడిపింతువు
వీణా తంత్రులు మీటుచు
విద్యలన్ని బోధింతువు

సృష్టి చేయు స్రష్టకు
దృష్టి నీవె అయినావు
అజ్ఞాన తమస్సు చీల్చి
ప్రజ్ఞానము పంచినావు

శబ్దము నీవే తల్లీ !
శక్తివి నీవే తల్లీ
భావము నీవే తల్లీ
జీవము నీవే తల్లీ !

"సరస్వతీ" అని కొందరు
"శారదా" అని కొందరు
వాగ్దేవీ అని కొందరు - వాణీ అని కొందరు
పూజింతురు నిన్నందరు - పూర్ణచిదానందమయీ !

# మనసార కొలవండి

మనసార కొలవండి
కనకమహాలక్ష్మిని
కష్టాలు ఈడేరును
అభిష్టాలు నెరవేరును -

వరలక్ష్మి కన్నుల్లో
వాత్సల్యము నెలకొన్నది
ఆ వరదాయిని చిరునవ్వుల
కరుణామృత మున్నది
ఆ చిన్మయి పదసన్నిధి
ఆనందము కొలువున్నది

అమ్మలగన్నయమ్మ
అక్షరాల ఆయమ్మే !
వేయిరేకులై విరిసిన
వైశాఖి ఆయమ్మే !
ముగురమ్మలు ఒకటైన
మూర్తి మహాలక్ష్మమ్మే !

పసుపు కుంకుమలు ఒడిలో
పరశించు పరమేశ్వరి
తేనె, పాల ధారల్లో
తీర్థమాడు భువనేశ్వరి
భక్తి ప్రపత్తులకు మెచ్చి
శక్తులిచ్చు ముక్తేశ్వరి !

# సప్తగిరి బాలాజీ

సప్తగిరి బాలాజీ ! శరణం శరణం
తొలగింపుము పెనుచీకటి మాయావరణం !

చదువులెన్ని చదివినా
సాధ్యపడని సత్యం
పదవులెన్ని పట్టుకున్న
పట్టుపడని సౌఖ్యం
నీ పద సన్నిధిలోనే వెలసింది
నీ చిరునవ్వులలోనే మెరిసింది !

జీవులన్నిటికి మున్నే
జన్మించిన శిలలు
జరా మరణములు లేని పరమహంసలు
నుడువే నీ మౌనభాష నేర్పించుము నరులకు
అర్థము లేనట్టి మాటలాడే పామరులకు !

ఆపదలన్నిటినుంచి
కాపాడే యుక్తి
అందరికీ సంపదలు అందించే శక్తి
నీ వజ్రకిరీటంలో నిక్షిప్తము స్వామీ !
నీ శుభకర హస్తగతమె సర్వాంతర్యామీ !

అన్నమయ్య వంటి కవులు
పాటలన్నీ అల్లి
భక్త కోటి, కంటి చూపు పూవులన్ని చల్లి
సేవించే నీ చరణం, నిర్భయ శరణం
పూజించే నీ వదనం సమతాసదనం

# శ్రీరామచంద్రుణ్ణి

శ్రీరామచంద్రుణ్ణి ఏరుదాటించాలి
స్వామి పద సేవలో జన్మము తరించాలి !

రామ! రామా యంచు
రవళించు చెట్టేదో
జానకీ రాముణ్ని
ధ్యానించు కట్టేదో
పసిగట్టి సరిక్రొత్త పడవ నిర్మించాలి !

పూలన్ని, రామయ్య
పూజకై పూచేను
అడవిదారుల స్వాగ
తాంజలులు పట్టేను
ఎపుడు వచ్చేయునని ఎదురు చూసేను !

పక్షులన్నీ ఏటి
గట్టుపై కూడేను
రామనావమె, పెక్కు
రాగాల పాడేను
మూగ మృగములు కూడ మురిపాన ఆడేను

(గుహుని భక్తి పారవశ్యం)

# రాతిబొమ్మవనుకొని

రాతిబొమ్మ వనుకొని, నీ
చేతిని నరికేశారా !
జడరూపము అనుకొని నిను
కడలిని పడవేశారా
కనకమహాలక్ష్మీ నిను కలవర పెట్టారా !

సూర్యచంద్ర కిరణాలే
నీ సుందర హస్తాలు
కాల సరసిలో విరిసిన
లీలా కమలాంబ నీవు
పరాశక్తి ప్రకృతి నీవు
హిమశైలాకృతివి నీవు

ముక్కలైన నీ రెక్క
లెక్క లేని చేతులై
భక్తులైన ప్రతి ఒకరికి
ముక్తి పథము చూపించును
ఆపద మొక్కుల వారికి
అభయ హస్త మందించును

నిత్యమైన సత్యానికి
నిగమగోచర త్వానివి
దివ్య మానవత్వానివి
దేవీ! దైవత్వానివి
కష్టనష్టములు తీర్చే
కనక మహాలక్ష్మివి !

## కనకదుర్గాదేవి !

కనకదుర్గాదేవి
కరుణించవమ్మా !
భక్తులను కాపాడు
శక్తి నీవమ్మా !

ఇంద్రనీలాద్రిపై ఈశ్వరివి నీవు !
ఈశ్వరివి నీవు, భువనేశ్వరివి నీవు !
శాశ్వతపు నీవు రాజేశ్వరివి నీవు !
విజయవాడలోన వెలిశావు నీవు !

పావనకృష్ణ నీ
పాదాలు కడుగు
వేదాలు నీ కీర్తి
వినిపించుచుండు
శీత పవనాలు అభిషేకించు నిన్ను
ఆబాలగోపాలమర్చించు నిన్ను !

మహిషాసురుని నాడు
మర్దించినట్లు
మధుకైటబుల పట్టి గరిపించినట్లు
చండముండుల చీల్చి చండా అనట్లు
పరిమార్చు మానవాసురుల పసిగట్టి
దునుమాడు మా దుష్టశక్తులను తల్లీ !
హతమార్చు నరపిశాచుల చుట్టచుట్టి
జయ జయ విజయదుర్గ జయ అమరవల్లీ
జయము చాముండేశ్వరీ విజయవల్లీ !

## దేశమే దేవాలయం

దేశమే దేవాలయం
విద్యయే దైవం !
దేశ విద్యల పూజలోన
దీపికలు మేము

తల్లిదండ్రుల, గురువరేణ్యుల
చల్లచల్లని దీవెనలతో
శ్రద్ధగా చదువుకుంటాము
బుద్ధిగా మసలుకుంటాము

పెక్కు పేరులు పెట్టుకున్నా
పెక్కుదారులు వేసికొన్నా
ఒక్కడే భగవంతుడు !
ఒక్కటై మేమంత అతనికి మొక్కుతుంటాము !

మతములన్నీ భాషలన్నీ
మనిషికీ దేవునికి మధ్య
చెరిగిపోని వంతెనలుగా
పరిగణిస్తాము
నిత్య జీవన సత్యం గీతం పాడుకుంటాము

మట్టిలోన, మనిషిలోన
చెట్టులోన, పుట్టలోన
చెంతనున్న నీడలోన - అంతులేని నింగిలోన
దాగియున్న సత్యమునుగను
యోగదృష్టిని పెంచుకుంటాము

## రజత కవచధారిణీ !

రజత కవచధారిణీ
పసిడి పసుపు ఆమనీ !
కుంకుమాభ శోభినీ !
కనకమహాలక్ష్మీ !

నీలాంబర వర్ణినీ !
లీలాంబుజపాణినీ
క్షీరాభిషేక పావనీ
సాగరతటి వాసినీ
సర్వలోక జననీ ! కనకమహాలక్ష్మీ !

భవభయార్తి హారిణీ !
తాపత్ర యవారిణీ !
సద్గుణగణ కారినీ
కరుణాదృక్ వాహినీ ! కనకమ హాలక్ష్మీ !

అష్టలక్ష్మి రూపిణీ
అభ్యుదయోద్దీపినీ
వైశాఖీపురమునే
వైకుంఠముగా చేసి
ముజ్జగాలు పాలించే
ముక్తేశ్వరి - పరమేశ్వరి - కనకమహాలక్ష్మీ

## ఆత్మవునీవని

ఆత్మవునీవని తెలిసికో
జీవాత్మవు నీవని తెలిసికో !

నిర్మలనిశ్చల శాంతిమయంగా
నిరుపమ నిర్గుణ శాంతిమయంగా
పరంజ్యోతి పరమాత్ముని సన్నిధి
ప్రకాశించెడి తారవు నీవని తెలిసికో -

ఫాలభాగమున లీలగ కూర్చుని
ప్రాపంచిక జీవితమును గడిపే
పంచేంద్రియ రథసారధి నీవని
పవిత్ర చిరంతనాత్మవు నీవని తెలిసికో

మహత్వ స్వభావ గుణాలు మరచి
మాయలోనపడి విలవిలలాడకు !
రాజయోగమున తేజోలోకము
దర్శించుము ఆనందబిందువై
సత్యయుగానుభూతి బృందవై !

"అబ్బూశైల" శిఖరామృత ధామం
పరమ పితా శివబాబా రామం
ఈశ్వరీయ విశ్వవిద్యాలయం
రాజయోగరస మురళీ గానం
విశ్వేశ్వరునికి నరునికి మధ్య
శాశ్వత ఇహపర సుఖసోపానం

## చెట్టుచెట్టుకు

చెట్టుచెట్టుకు, చెవి
పెట్టి వినుమా !
రాయి రాయిని కాస్త
తట్టి వినుమా !

రామనామస్మరణ
రాగమే వినిపించు
దానవాంతకుడైన
జానకీరాముడు
వచ్చుచున్నాడన్న
వార్తయే వినిపించు

పక్షులన్నీ స్వామి
పాటలైపోయె
పూవులన్నీ స్వామి
పూజలై పోయె
సెలయేళ్లు శ్రీరాము
సేవలైపోయె
కాలిబాటలు, రత్నకంబళులు అయిపోయె !

అడవియే గొంతెత్తి
కొండలే తలలెత్తి
అయ్యోధ్య రాము, నా
మామృతము కురిపించె
దండకారణ్యమ్ము
దాటి వచ్చే ప్రభువు
దర్శనమ్మున ప్రకృతి ధన్యమైపోయె !

# పాలు తేనె తెచ్చాము

పాలు, తేనె తెచ్చాము
భక్తితో వచ్చాము
మాటలలో చెప్పరాని
మౌనముగొని తెచ్చాము !

నిన్ను నమ్ముకున్నాము
నిర్భయముగా ఉన్నాము
పెడదారిన పోకుండా
నడిపించుము తల్లీ !
సుఖ సంపద్వల్లీ !

నిక్కమైన నీ మహిమలు
లెక్కకు మిక్కిలి మాతా !
మార్గశీర్షమే నీకు
మధుమాసము మాతా !

బురుపేట నీ పీఠము
హిమగిరి నీ కిరీటము
నిరుపేదలు, నిర్బలులు
నిఖిల లోక వాసులూ
నీ కంటి పాపలు

# నిస్తుల శక్తి

నిస్తుల శక్తి ప్రదీపుని
నీలాకాశ స్వరూపుని
సప్తగిరీశుని కనగానే
నా సుప్త చేతనము మేల్కొనెను

శూన్యపు ఈశాన్యంలో
పాలగపుంతపు అనంతంలో
కుండలీకృత ఫణి పానుపుపై
పవళించిన పరిమాత్మను చూచి
పరవశించి పోయాడు

చరిత్రకందని కాలం కట్టిన
శిలాతోరణం క్రింద
మట్టికి చెట్టుకు ప్రాణం పోపిన
మహారణ్య మౌనంలో
కనులు మోడ్చి నే కరిగిపోతిని
కలల అలల సంద్రంలో
సృష్టిమూల కేంద్రంలో

వెలుగు లేని నా దేహములోనె
వెలిగె గోపుర ప్రాకారాలు
రూపులేని నా ఆత్మాలయము
ఊపించెను శ్రీకారాలు
వినివించెను ఓంకారాలు

## పురుషోత్తముడు

పురుషోత్తముడు వెలసిన
పూరీ క్షేత్రం
తూరపు తీరం తెరచిన
తారకనేత్రం !

సోదరీ సోదరులు
సుభద్ర బలభద్రులు
తోడునీడగా వెలసిన
నీలమాధవుడు - లీలావతారుడు

గిరిజనులు పురజనులు
రారాజులు నిరుపేదలు
ఆబాలగోపాలం
ఆరాధించే దైవం
అఖిల జగన్నాథుడు

అడవిచెట్టు బోదెనుండి
భక్తి కళాశక్తితోడ
తోడుకున్న అమృత స్ఫూర్తి
తురీయ చేతనమూర్తి
పరాత్పరుడు - శివంకరుడు
శుభంకరుడు - సుదర్శనుడు

నింగిని నేలను కలిపే
శృంగాలయ వాసుడు
దేశ విదేశాల చేరదీసెడి
సుగుణ విలాసుడు
పురుషోత్తముడు వెలసినా పూరీ క్షేత్రం

# సుఖ సంపదే వర్ధినీ !

సుఖ సంపదే వర్ధినీ
సుందర కపర్దినీ
కరుణా వీక్షణధునీ
కనక మహాలక్ష్మీ !

ఆదిలక్ష్మి, ధ్యానలక్ష్మి
ధైర్యలక్ష్మి, గోపిలక్ష్మి
విజయలక్ష్మి, విద్య లక్ష్మి
పరిమిత సంతానలక్ష్మి
మితిలేని ధనలక్ష్మి
అష్టలక్ష్ములను, కొలిచి
నట్లే నిను కొలిచినచో !

ఏడుకొండ లెక్కలేని
ఏ గుడులకు చేరలేని
భక్తులు నిను 'అమ్మా!' అని
భజయించిన చాలుగదా
కోరుకున్న మొక్కులన్ని
తీర్చెదవు ఓదార్దైదవు

కుచేలులు నినుకొలచి
కుబేరులౌతున్నారు
జానపదులు నిను తలచి
జ్ఞానవిదులు అయ్యేరు
ఆ బాల గోపాలం అమ్మా! అని నిను పిలుచుచూ
ఆత్మానందంలో పరమాత్మను దర్శించేరు

# నా కన్నులు చెమ్మగిల్లె

నా కన్నులు చెమ్మగిల్లె
నీ కోవెలలో
నా కోరిక లీడేరెను
నీ సన్నిధిలో -

ఆశలతో నీ కొండకు
మోసుకొని తెచ్చిన
మొక్కుబడుల మూటలు
మంచువోలె కరిగిపోయె
దించగానే నీ ముందట

చదువులెన్ని చదువుకున్న
సమాధానములు దొరకని
ప్రశ్నలు నిన్నడగాలని
పట్టుబట్టి వచ్చాను
నిన్ను చూచి చూడగానె
అన్ని మరచిపోయాను -

తీరని తలపుల దాహం
దార సుతులపై మోహం
తీరిపోయె నా చిదాత్మ
చేరగానే నీ ఒడిలో
ఒడలు చెప్పలేని గుట్టు
బయట పడెను నీ గుడిలో

# వీధిలోన నీవే !

వీధిలోన నీవే,
వినువీధిలోన నీవే!
ముజ్జగాలు పాలించే
ముక్తేశ్వరి నీవే !
తేజోమయ పీఠి రాజరాజేశ్వరి నీవే !

గుడిగుడిలో నీవే
గుండె గుండెలో నీవే
మింటిలోన నీవే
ఇంటింటిలోన నీవే
బురుజుపేటలో వెలసిన భువనేశ్వరి నీవే!

దారివీవె, తేరువీవె
చేరు గమ్య మీవే
శ్రీకార, ఓంకార
చిద్రూపము నీవే !
కల నీవే, నిజము నీవే
కలకాలము నీవే !

తప్పేదో ఒప్పేదో
చెప్పేశారదావీవే !
కలిమేదో లేమేదో
తెలిపే లక్ష్మివి నీవే !
పాప పుణ్యముల ధర్మము
చూపు భవానివి నీవే
కరుణా సాగర తీరపు కనక మహాలక్ష్మి నీవె!

# ఏడుకొండల మీద ఏడాది !

ఏడుకొండల మీద
ఏడాది పొడుగునా
విరియు పర్వాల కన
అరుదెంచెను ఉగాది !

కొండకోనల నిండ
కోహమని సోహమని
కొసరిపాడే, కొత్త
కోకిలము వచ్చినది
చిత్రభానూదయ చైత్రమును తెచ్చినది

అసురశైశిర దష్ట
'అలిపిరి' జీవులకు
అభయ విభవము లిచ్చు
ఆమనియె విచ్చేసె

సప్తగిరి శిఖరాల
దీప్త కేతనమెత్తి
అక్షయానంద
బృందావనము ఏతెంచె

చెట్టుచేమలు కూడ
శ్రీకారములు చుట్టె
రాలురప్పలు కూడ
పూలగొడుగులు పట్టె
నవజీవనావన తిరమలేశ్వరునికి
వరవసంతోత్సవము
జరుపవచ్చె ఉగాది !



కృతకర్త జె. బాపురెడ్డి తన సతీమణి శ్రీమతి రాజేశ్వరితో
తిరుమలలో ఆధ్యాత్మ చింతనలో.......

---

డా. జె. బాపురెడ్డి ఒక I.A.S. అధికారిగా ఎన్నో పదవులు నిర్వహించారు. అయినా సృజనాత్మక కవితా దృష్టి ఆయనను నిరంతరం పరిపూర్ణ జీవితపథం మీద నడిపిస్తున్నది. 1936లో కరీంనగరం జిల్లాలోని ఒక మారుమూల గ్రామం "సిరికొండ"లో పుట్టి ప్రపంచమంతా చుట్టుముట్టి 36 దేశాలలో తెలుగు వాణిని వినిపించిన శారదోపాసకుడు. అన్ని ప్రక్రియల్లో, అన్ని భావధారల్లో ఆయన మాననీయ అభ్యుదయ శీలతను ఆవిష్కరించారు. వెలువరించిన సుమారు 30 గ్రంథాల్లో ఈ "శ్రీకార శిఖరం" ఆత్మానుభూతి చేతనాకేతనం అణువు నుంచి అనంతందాక అనుభూతి సత్య ప్రమాణంతో ప్రకృతితత్వాన్ని అల్లేఖించిన ఉపజ్ఞ ఆయనది. ఈ పుస్తకంలోని గీతాలు ఆబాల గోపాలన్ని అలరిస్తాయని ఆశిస్తున్నాం.

– ప్రచురణ కర్తలు.

# శ్రీకార శిఖరం

(గేయ సంపుటి)

జె. బాపురెడ్డి

జూబిలీ పబ్లికేషన్స్
హైదరాబాద్